PARLE

POPPINS

Goli Rainbow Wali - Doon Kya?

# Ram and Shyam

## దెయ్యాల నౌక

భాగం 1

రామ్ మరియు శ్యామ్ క్రూస్ లైనర్‌లో సెలవులు గడుపుతుంటారు.

ఆ డాల్ఫిన్‌ని చూశావా?

ఏమిటి? డార్న్! నేను చూడలేదు!

మరోవైపు కెప్టెన్ డెక్‌లో

ఓ గుట్టు తెలియని నౌక ఇటువైపు వస్తుంది

వారు ప్రమాదంలో చిక్కుకున్నట్టున్నారు. వాళ్లని రానివ్వు.

ఆ నౌకలోని మనుషులు బోర్డ్ మీదికి వస్తారు.

ఈ మనుషుల ఆకారాలు నాకు నచ్చలేదు

నాక్కూడా అలాగే అనిపిస్తుంది. ఏదో గందరగోళం ఉంది.

మమ్మల్ని కెప్టెన్ దగ్గరకు తీసుకెళ్ళండి. మా నౌక మునిగిపోయింది, మాకు సహాయం కావాలి.

కెప్టెన్ డెక్‌లో....

మీరా కెప్టెన్?

అవును

నేను సముద్రం దొంగ బ్లాక్‌బెర్డ్‌ని, మేము మీ పడవను అపహరించాము. మమ్మల్ని కెరెబియన్ ఐలాండ్ వైపుకు తీసుకెళ్ళండి.

మరోవైపు మేన్ డెక్ మీద కొందరు సముద్రపు దొంగలు ప్రయాణికులను బందీలుగా మార్చుతారు.

అందరు నోరు మూసుకొని ఉండండి, మాకు కావలసింది దొరికిన తర్వాత మిమ్మల్ని వదులుతాము.

మిగితా సముద్రపు దొంగలు కెప్టెన్ మనుషులను కట్టేస్తుంటారు.

మేన్ డెక్ మీద మళ్ళీ...

వీళ్ళకు గుణపాఠం నేర్పే మార్గం నాదగ్గరుంది.... ష్ష్షుuuuuuuu.....

అద్భుతమైన ఉపాయం.

అబ్బాయిలు పైనెపల్ రుచిగల పాపిన్స్ తింటారు....

ఇవ్వనా? అదృశ్యం

POPPINS

సముద్రపు దొంగల నుంచి అందర్ని కాపాడడంలో ఈ అబ్బాయిలు సఫలమవుతారా? వచ్చే సంచికలో తెలుసుకోండి.

Fourth fold




To,
**Boomer T20 Mania,**
**PB No. 28,**
**Okhla Industrial Estate-3,**
**New Delhi - 110020**

PLEASE
AFFIX
STAMP

Second fold

Third fold

ప్యాక్‌ల పైన రన్‌లు సేకరించండి మరియు
గెలుచుకునే* అవకాశాన్ని సాధించండి










మీకు ఇష్టమైన
ఆటగాళ్ళని కలుసుకోండి.

First fold

*Terms & conditions apply. 

**Name** ______________________

**Address** ______________________

**Phone No.** ______________________

**Email id.** ______________________

**Slogan** ______________________

*OFFICIAL BUBBLEGUM OF*
















## www.BOOMERFUNZONE.com

Instructions:
- Cut along the dotted line
- Then fold along the 1st fold, followed by the 2nd fold, 3rd fold and finally the 4th fold on top
- Your envelope is ready
- Once you put the wrappers inside, stick along the folds to close the envelope
- Now put a stamp and send it to us




సంపుటి: 63 ఏప్రిల్ 2010 సంచిక: 4

పేరు.............................................. వయస్సు.......

చిరునామా..................................................................

..............................................................................

..............................................................................

ఫోన్:................ ఇ-మెయిల్:.......................................

## మీ మనసులో మాట చెప్పండి!

మీ అభిప్రాయాలను ఒక్కొక్క కథకు/శీర్షికకు నేరుగా ఉన్న గళ్ళల్లో టిక్ చేసి చుక్కలగీత గుండా కత్తిరించి మీ ఫీడ్‌బ్యాక్‌ను పోస్టు ద్వారా మాకు పంపండి.

| అత్యుత్తమం | ఉత్తమం | బావుంది | ఫరవాలేదు | మామూలు |
|---|---|---|---|---|
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |
| ☐ | ☐ | ☐ | ☐ | ☐ |

**Editor, CHANDAMAMA INDIA LTD.,**
B-3, Lunic Industries, Cross Road 'B',
MIDC, Andheri (East), Mumbai-400093.

# ఈ సంచికలో...

## చందమామ

# సెలవులొచ్చేశాయి!

మిత్రులారా!

సెలవుల కోసం మనమంతా ఎదురుచూస్తున్నాం. ఎండ కాచుకుంటూ, ఎలాంటి ఆందోళనలూ లేకుండా రెండు నెలలు హాయిగా గడపడానికి సెలవుల తలుపులు తడుతున్నాం. నెలల తరబడి సాగించిన కఠిన శ్రమ, సన్నద్ధతల తర్వాత, పరీక్షలు ముగిసిపోవడంతో అందరం ఉపశమనం పొందుతున్నాం కదూ! అదే సమయంలో ఈ పరిమిత కాలంలో గరిష్టంగా ప్రయోజనం పొందడానికి మనం సెలవులను పథకం ప్రకారం గడపాలి. చందమామ చదవడం, కొత్త ప్రాంతాలను సందర్శించడం, బంధువులను, స్నేహితులను కలవడం, ఆటలాడటం వంటి పనులను ముందుగా మనం నిర్ణయించుకుందాం. పాఠశాల టైం టేబుల్ లాగే, సెలవుల టైం టేబుల్‌ను కూడా రూపొందించుకుందాం! సెలవులు ముగిసినప్పుడు, మనం వెనక్కు చూసుకుని మనం పొందిన సంతోషానుభూతులను అప్పుడు మాత్రమే నెమరు వేసుకోగలం.

మేం ముందే వాగ్దానం చేసినట్లుగా, సెలవుల కాలాన్ని దృష్టిలో ఉంచుకుని, భారతీయ జానపద కథలపై చందమామ వార్షిక సంపుటిని వాటి ఆడియో సీడీని కూడా విడుదల చేశాము. ఈ నెల ఏప్రిల్ ఫూల్స్ డే తో మొదలవుతున్నప్పటికీ, మా ప్రకటన అబద్ధం కాదు.. వాస్తవం!! మన మహా చిత్రకారుల మేటి చిత్రాల ఆర్ట్‌బుక్‌ను విడుదల చేస్తున్నట్లు ప్రకటిస్తున్నందుకు మేం గర్వపడుతున్నాం.

జీసస్ క్రీస్తును శిలువ వేసిన ఘటనను గుర్తుచేసే గుడ్ ఫ్రైడే ఏప్రిల్ 2న వస్తుంది. తరవాతి ఈస్టర్ ఆదివారం పునరుత్థాన దినం. మన క్రైస్తవ మిత్రులకు ఈ రెండు దినాలు చాలా ప్రాముఖ్యత కలవి. ఏప్రిల్ 7 ప్రపంచ ఆరోగ్య దినం. ప్రపంచమంతటా పెరుగుతున్న ఆరోగ్య సమస్యలను గుర్తిస్తే, ఆ రోజును మనం తప్పక జరుపుకోవలసిందే. జీవితమంతా ఆరోగ్యంగా బతకడానికి మనకు ఏది అవసరమో మనం తప్పక కనుగొనాలి మరి.

మా కొత్త పుస్తకాలను చదివి, మీ అభిప్రాయం చెబుతారని భావిస్తున్నాం. ఈలోగా ఈనెల చందమామ కథల నిధి మీకోసం సిద్ధంగా ఉంది చూడండి.... – సంపాదకుడు




ఏప్రిల్ 2010 Rs. 20/-
*Founded by* **B. Nagi Reddi and Chakrapani**
**Editor & Publisher :** Prashant Mulekar
**Associate Editors :** Sowmya Rajendran, R. Vaasugi, K. Raja Sekhara Raju
**Senior Artists:** K.C. Sivasankaran (Sankar), Gandhi Ayya, P. Mahesh
**Artist :** Venki
**Creative Designer :** Meghana Vaidyanathan
**Creative Writers :** S. Niveditha, R. Rama
**Layout Designers :** K. Narendra Raju
**Sanjay B Thorat : Head - Sales and Circulation**
**CHANDAMAMA INDIA LTD.,**
B-3, Lunic Industries, Cross Road 'B', MIDC, Andheri (East), Mumbai-400093
Phone : +91 22 28312872 / 28311849
Mobile : +91 9821017787
email : sanjay.thorat@chandamama.com
**AB Sairam : Manager - Sales & Circulation**
**CHANDAMAMA INDIA LTD.,**
2/513(Old 3/396), SundeepAvenue Eest, 2nd Main Road, Chinna Neelankarai, Chennai - 600 041
Mobile : +91 9841983774
e-mail : sairam.ab@chandamama.com
**Mr. Vinay K Brid : Manager - Sales & Circulation**
Mobile : +91 9869574816
**Rajendra K Jadhav : Asst. Manager - Circulation**
Mobile +91 9320565048
email : rajendra.jadhav@chandamama.com
**Subhankar Rej, Asst. Manager - Sales & Circulation**
email: subhankar.rej@chandamama.com
Mobile +91 9474916267
**Bengaluru : CHANDAMAMA INDIA LTD.,** 18, 10th Cross, Mayura Street, Papanna Lay Out, Outer Ring Road, RMV 2nd Stage, Bangalore-560094,
Phone +91 80 6655 1000
**Chennai : K. Ravishankar, Sales Officer - Circulation,** Mobile +91 98414 00981
email : ravishankar.k@chandamama.com
**Business Development : Ananth Prakash**
Mobile +91 98362 82202, 98351 82202
email : ananth.prakash@chandamama.com
**Content Head - Online : Sowmya Bharadwaj**
email : online@chandamama.com
**Marketing Enquiries :**
email : marketing@chandamama.com
**Advertisement :** email : sales@chandamama.com
**Subscription Queries:**
email : subscription@chandamama.com
**Head Office : CHANDAMAMA INDIA LTD.,**
B-3, Lunic Industries, Cross Road 'B', MIDC, Andheri (East), Mumbai-400093
Phone +91 22 28312872 / 28311849
email : chandamama@chandamama.com
Website : www.chandamama.com

Printed and Published by Prashant Mulekar at Shruti Art Pvt. Ltd., Unit No.1, Gupta Mills Estate, Devidayal Industrial Compound, Darukhana, Reay Road (East), Mumbai - 400 010 on behalf of Chandamama India Limited, B-3, Lunic Industries, Cross Road 'B', MIDC, Andheri (East), Mumbai-400093. Editor : Prashant Mulekar

# పాఠకుల లేఖలు

ఫిబ్రవరి చందమామ ఆలస్యంగా వచ్చినప్పటికీ కథలు చాలా బాగున్నాయి. 'దర్జీ మేలువస్త్రం', 'మౌనసాక్షి' కథలు సరదాగా నడిచాయి. 'పొదుపు' కథ చిన్నదైనా చక్కటి సందేశం ఇచ్చింది. మంచి కథలు ప్రచురించినందుకు అభినందనలు.

– ప్రత్యూష, తిరుపతి

ఫ్రిబవరి సంచికలో వచ్చిన 25 ఏళ్లనాటి కథ అల్లుడి శక్తి అద్భుతంగా ఉంది. మానవులను గజగజలాడించే రాక్షసులు కూడా ఈ కాలపు అల్లుళ్ల శక్తిముందు దిగదుడుపే అని, ఇంటల్లుడు కోపంగా చూస్తే ఇంటిల్లిపాదీ నీరుగారిపోవలసిందే అని విన్న రాక్షుసుడు పెళ్లి చేసుకుంటే తప్ప తనకూ అంత శక్తి రాదని భావించడం మన సమాజంలో అల్లుళ్ల పోకడలను అద్దంలో చూపించింది. దీర్ఘకాలం చెట్టుమీదనే ఉండిపోయిన రాక్షుసుడు, ఈ మూడువందల ఏళ్లల్లో మానవుల శక్తి అంత పెరిగిందా అనుకోవడం చదువుతుంటే నవ్వాగలేదు.

– అప్పల్నాయుడు, శ్రీకాకుళం

ఫ్రిబవరి చందమామ చాలా ఆలస్యంగా రావడం వలన ఎంతగానో నిరీక్షించాను. అరవై సంవత్సరాలలో ఇలా ఎన్నడూ జరగలేదు. కనుక మొదటి వారంలోనే చందమామ అందరికీ అందుబాటులో ఉండేటట్లు చర్యలు తీసుకోగలరు.

– పులిజాల రవీందర్ రావు, హై దరాబాద్

అనివార్య కారణాల వల్ల చందమామ ఫిబ్రవరి సంచిక చాలా ఆలస్యంగా మార్కెట్‌లోకి వచ్చింది. దీనివల్ల మార్చి, ఏప్రిల్ సంచికలు కూడా కాస్త ఆలస్యంగానే విడుదల కావచ్చు. చందమామ పాఠకులకు కలుగుతున్న అసౌకర్యానికి మనఃపూర్వక క్షమాపణలు.

– సంపాదకులు

మీ అభిప్రాయాలను ఈమెయిల్
feedback@chandamama.com
ద్వారా పంపవచ్చు.



**Visit us at : http://Telugu.chandamama.com**



# ఫెబర్-కాజిల్

1761 నుంచి

## లిటిల్ ఆర్టిస్ట్

### కాంటెస్ట్ నం.1

### (ఫ్యాబ్రిక్ కలర్స్ మరియు 3 డైమెన్షనల్ అవుట్‌లైనర్స్)

ప్రియమిత్రులారా;

మిమ్మల్ని ఇక్కడ కలుసుకుంటున్నందుకు సంతోషం. మీకు మేం ఒక ఇంటరాక్టివ్ మరియు సృజనాత్మక పోటీని ప్రదర్శిస్తున్నందుకు సంతోషిస్తున్నాం. ఈ పోటీ పేరు 'లిటిల్ ఆర్టిస్ట్' పోటీ. మొత్తం ఆరు పోటీల్లోనూ పాల్గొని ప్రాడక్ట్ కార్టూన్‌తో పాటు మీ చిత్రాలను పంపండి. అలాగే ప్రతి పోటీలోనూ ఇచ్చిన చిరునామాకు మీ పాస్‌పోర్ట్ సైజ్ ఫోటోలను కూడా పంపండి. పోటీలో ఉత్తమంగా నిలిచిన ఎంట్రీలకు ఆకర్షణీయమైన బహుమతులు, క్రియేటివ్ సీడీలు, సర్టిఫికెట్లు అందిస్తాము. మొత్తం 6 పోటీల్లో పాల్గొన్న వారి దరఖాస్తులను లక్కీ డ్రా తీసి మెగా బహుమతిని ప్రకటించగలము.

కాబట్టి ఇప్పుడే పాల్గొనడానికి త్వరపడండి!

**ఫెబర్ కాజిల్ చరిత్ర**

జర్మనీలోని స్టెయిన్‌లో 1761లో స్థాపించబడిన ఫెబర్-కాజల్ 250 సంవత్సరాలుగా కొనసాగుతున్న సంస్థ. రాత, చిత్రలేఖనం, కలరింగ్ మరియు మార్కింగ్ పనుల్లో ప్రపంచంలోనే అతి పెద్ద సంస్థల్లో ఒకటిగా దీనికి అంతర్జాతీయ ప్రాశస్త్యం ఉంది. ప్రపంచ వ్యాప్తంగా 1800 ఉత్పత్తులను పంపిణీ చేస్తున్న ఫెబర్-కాజిల్ ప్రపంచంలోనే అత్యుత్తమ ఉత్పత్తులను తయారు చేయడం అనే విశిష్ట లక్ష్యంతో పనిచేస్తోంది.

కాబట్టి మీరు ఫెబర్-కాజిల్ ప్యాక్‌ను చూసినప్పుడు అత్యుత్తమమైన దాన్ని మీరు కొంటున్నారని ఇతరులు ధృవీకరిస్తారు.

**పిల్లల భద్రత, పర్యావరణ పరిరక్షణలో ఫెబర్-కాజిల్ నిబద్ధత**

సామాజిక బాధ్యత మరియు పర్యావరణ పరిరక్షణ అనేవి ఫెబర్-కాజిల్ బ్రాండ్ ప్రాథమిక లక్ష్యాలలో ఒకటి. మా వినియోగదారుల పట్ల మా సామాజిక బాధ్యతలో భాగంగా ఫెబర్-కాజిల్ ఇండియా పిల్లలు, పర్యావరణ పరిరక్షణకు పూర్తిగా అనుకూలించే ఉత్పత్తులను మాత్రమే సమర్పిస్తుంది.

మా ఉద్దేశ్యంలో పిల్లల భద్రత అంటే విషరహిత వస్తు సామగ్రిని మరియు ఫుడ్-గ్రేడ్ డైలను ఉపయోగించడమని అర్థం. పదార్థాలు మాత్రమే కాకుండా ఉత్పత్తి పిల్లల భద్రతకు అనువుగా ఉండేలా డిజైన్ రూపొందించడం కూడా సంక్లిష్టమైనది. సరైన వయసుకు, సరైన ఉత్పత్తిని అందివ్వడంపై మేం ప్రత్యేక శ్రద్ధ తీసుకుంటాము.

ఫెబర్-కాజిల్ పర్యావరణం పట్ల కూడా శ్రద్ధ వహిస్తుంది. తిరిగి ఉపయోగించే, మరియు పర్యావరణ అనుకూల వస్తువులు, ప్రక్రియలను ఉపయోగించడానికి కూడా మేం నిబద్ధత వహిస్తాము. నాణ్యత, పర్యావరణ నిర్వహణ వ్యవస్థలకు గాను మా కర్మాగారాలు ఐఎస్ఓ 9000, 2008 మరియు ఐఎస్ఓ 14001; 2004 ప్రమాణాలను సాధించాయి. ఫెబర్-కాజిల్‌లో మేం తయారు చేసే ప్రతిదీ సురక్షితమైనది, సమాజానికి, ప్రపంచానికి, మీకు కూడా అనుకూలమైనదిగా ఉంటుందని మేం విశ్వసిస్తున్నాము!

ఈ పోటీలో పాల్గొనేవారందరినీ తన బ్రాండ్‌తో ఫలవంతమైన ప్రయాణం వైపుగా కొనిపోవాలని ఫెబర్-కాజల్ కోరుకుంటోంది.






మీ దరఖాస్తులను పంపవలసిన చిరునామా
**CHANDAMAMA INDIA LTD.**
B-3, LUNIC INDUSTRIES, CROSS ROAD 'B', MIDC, ANDHERI (EAST), MUMBAI-400093, PHONE +91 22 28312872 / 28311849.

## క్రియేటివ్ కార్నర్

### సృజనాత్మక ప్రాజెక్టులు

### ఫెబర్-కాజల్ మోడెల్లింగ్ డాఫ్

ప్రియమైన చిన్నారులారా,

ప్రపంచంలో చాలా కొద్ది స్థాయిలో కళ, హస్త కళా కార్యకలాపాలు మాత్రమే సృజనాత్మక విస్తరణ అవకాశాలకు తావిస్తుంటాయి. మోడెల్లింగ్ డాఫ్ చేతులు, కండరాలు, కళ్లు ఉపయోగిస్తూ పిల్లలను ఆకట్టుకునే రకం ప్లేని ప్రతిపాదిస్తుంది. కాబట్టి పిల్లల దృక్పథంలో చూస్తే ఇది వినోదాత్మకంగా ఉంటుంది. ఇది ప్రణాళిక మరియు సంజనాత్మక నిర్మాణం ద్వారా పిల్లల ప్రయోజనాలను కాపాడేరకం సృజనాత్మకమైన కార్యకలాపాలను కూడా ప్రేరేపిస్తుంది. దీనిద్వారా వారు తమ స్వంత ప్రవర్తక నైపుణ్యాలు మరియు 3 డి డైమెన్షనల్ ఆలోచనను అభివృద్ధి చేసుకుంటారు.

### మీ ఊహాశక్తిని తీర్చిదిద్దుకోండి

(క్రమానుగత సాంకేతికతల ద్వారా)

**లిటిల్ బాయ్**



తల కోసం: ఒక నారింజ బంతిని మడిచి మెల్లిగా అదమండి.

చిన్నపాటివైన 2 గోధుమ బంతులను కళ్లమీద నొక్కి ఉంచి, వాటిని ముఖంమీద ఉంచండి.

చతురస్రపు ఆకారంలో పచ్చటి బంతిని అదిమి పెట్టడం ద్వారా క్యాప్‌ని రూపొందించండి.

శరీరం కోసం: ఆకుపచ్చటి బంతిని మడిచి కొండచిలువ రూపంలో అదిమిపెట్టండి.

కాళ్లు, చేతుల కోసం: అర చేతులకోసం రెండు నీలి దుంగ రూపాలను మడిచి పెట్టండి. రెండు చిన్న పసుపుపచ్చ బంతులను చేతుల కోసం గాను మడిచిపెట్టండి. అదేవిధంగా కాళ్లకోసం రెండు నారింజరంగులోని దుంగ రూపాలను మడిచి పెట్టండి. పాదాలకోసం రెండు చిన్న పసుపుపచ్చ బంతులను మడిచిపెట్టండి.



టై కోసం: రెండు పొడవాటి పసుపు మరియు నీలి తాళ్లను తయారుచేసి వాటిని టైకోసం ఒకటిగా చేర్చి మడవండి.

పొడవాటి గోధుమ రంగు తాడు తీసుకుని దాన్ని బెల్ట్‌లాగా మడవండి.

### మోడెల్లింగ్ డాఫ్

### డిజైన్ మోడ్యూల్



### మోటార్ స్కిల్ వృద్ధి కోసం రూపాలతో ఆడుకోవడం





# వైద్యుడి ఆత్రుత

కూతురుకు పెళ్లి సంబంధం కుదుర్చుకునే పనిలో, వైద్యుడు అనంతాచార్లు పొరుగూరు వెళ్ళాడు. అక్కడ  ఆయనకు వాళ్ళ ఊరువాడొకడు కనిపించి, భూస్వామి భూషయ్య జ్వరంతో మూసిన కన్నెరగకుండా పడివున్నట్లు చెప్పాడు.

దానితో ఆచార్లు ఉన్నఫళంగా బేరమైనా ఆడకుండా రూపాయి ఇచ్చి గుర్రబ్బండీ కట్టించుకుని రేవు దగ్గిరకొచ్చాడు.

నదిలో వరద పారుతూండటం వల్ల, నది దాటించే పడవవాడు బెట్టు చేయబోయాడు. నది పొంగుతున్న సమయంలో పడవ ప్రయాణం ప్రమాదం అని చెప్పాడు. వాడికి పావలో, అర్థో ఎక్కువ ముట్టజెబుతానని ఆచార్లు ఆశ చూపి, మొత్తానికి నది దాటి ఊరు చేరుకున్నాడు.

ఈ సంగతి విన్న, ఆ ఊరివాళ్ళు, ''ఆచార్లు గారూ, మీలాగా రోగులపట్ల అంత శ్రద్ధా, వృత్తిపైన అంత గౌరవం వుండేవాళ్ళు చాలా అరుదు! మీ వంటి వారు మా ప్రాంతంలోవైద్యుడిగా ఉండడం మా అదృష్టం'' అని పొగడసాగారు.

ఆచార్లు ఆ పొగడ్తలు కాసేపు విని, ''ఈ శ్రద్ధా గౌరవాల మాటకేం గాని, నేను తొందరగా వెళ్లి, ఆ వేసేమందేదో వెయ్యకపోతే, మా భూమయ్య ఏ మందూ అక్కరలేకుండానే, కోలుకుని లేచి తిరిగే ప్రమాదం ఉంది. లోగడ ఇలా రెండు సార్లు జరిగింది. ఇప్పుడు మందు ఇచ్చి వచ్చా గనక తరవాత వైద్యం చేసినందుకు ఆయన్ను డబ్బు అడగడానికి యిబ్బందేమీ వుండదు!'' అన్నాడు.

– కమలిని





# ఫెబర్-కాజిల్

1761 నుంచి

# లిటిల్ ఆర్టిస్ట్

## (ఫ్యాబ్రిక్ కలర్స్ మరియు 3 డైమెన్షనల్ అవుట్‌లైనర్స్)

### కాంటెస్ట్ నం.1 (మీ స్వంత ఫేస్ మాస్క్‌లను రూపొందించండి)

ముఖంపై ధరించే మాస్క్‌లను రూపొందించడంలో మీ సృజనాత్మక నైపుణ్యాన్ని వ్యక్తపరచండి.



సూచనలు

- మందపాటి తెల్లటి పోస్టర్ కాగితం తీసుకోండి
- మీకు నచ్చిన రూపంలో మాస్క్ తయారు చేయడానికి కత్తెరలను ఉపయోగించి (ప్రత్యేకించి ఫెబర్ -కాజిల్ క్రాఫ్ట్ కత్తెరలను వాడండి) కాగితాన్ని కట్ చేయండి. పెద్దపెద్ద డిజైన్‌లను రూపొందించండి. మీ ముఖం వద్దకు కాగితం తీసుకుని వచ్చి ఫెబర్-కాజిల్ మార్కర్ లేదా స్కెచ్ పెన్ వాడి కళ్లు, చెవులు, నోరు వంటి వాటిని గుర్తు పెట్టండి.
- మీకు ఇష్టమైన ఫెబర్-కాజిల్ ఫ్యాబ్రిక్ రంగులను (క్లాసిక్, పెరల్, మెటలిక్, మెరుపు రంగులు) వాడి మాస్క్ ముందుభాగంపై రంగులద్దండి.
- ఫెబర్-కాజిల్ 3-డైమన్షనల్ అవుట్‌లైనర్లతో (క్లాసిక్, పెరల్, మెటలిక్, మెరుపు రంగులు) మాస్క్‌ను సింగారించి రూపరేఖలు గీయండి.

ట్యాగ్‌లో ఒక రంధ్రం చేసి శాటిన్ రిబ్బన్/ఐస్ క్రీమ్ స్టిక్‌తో దాన్ని భద్రపర్చండి. శాటిన్ రిబ్బన్/ఐస్ క్రీమ్ స్టిక్‌ను ఫెబర్-కాజిల్ 3-డైమన్షనల్ అవుట్‌లైనర్లతో అలంకరించండి

**కాబట్టి మీ స్నేహి తులతో కలిసి మాస్క్‌లు తయారు చేసి ఓ సరి కొత్త సరదా ప్రపంచంలో కలిసి ఓలలాడండి!!!**

20 ఉత్తమ ఎంట్రీలకు గాను ఫెబర్-కాజిల్ సర్టిఫికెట్‌లు

విజేతల ఫోటోలు సంచికలో ప్రచురించబడతాయి

కింది బహుమతులను గెలుచుకోండి
ప్రథమ బహుమతి: రూ. 1500
రెండవ బహుమతి: రూ. 500
మూడవ బహుమతి: రూ. 150

మొత్తం ఆరు పోటీలలో పాల్గొనండి మరియు మెగా బహుమతిని గెల్చుకోండి.

**కార్టూన్‌లను (ఫ్రంట్ ప్యానెల్ లోనివి) ఫెబర్-కాజిల్ రంగులు మరియు 3-డైమెన్షనల్ అవుట్‌లైనర్లతో మాత్రమే అంటించండి.**

3 డైమెన్షనల్ అవుట్‌లైనర్లు




ఫ్యాబ్రిక్ రంగులు




మీకు సమీపంలోని దుకాణంలో స్టాక్ లభ్యమవుతుంది.

ఈమెయిల్ చేయండి. info@faber-castell.co.in. website: www.faber-castle.co.in

---

మీ పూర్తి వివరాలను పూరించండి. పూర్తిగా పూరించిన పత్రాలు మాత్రమే స్వీకరించబడతాయి.

పేరు:.................................... తరగతి:.................... స్కూల్ చిరునామా:....................
చిరునామా. (నివాసం) :....................................................................
మీరు ఉపయోగిస్తున్న ఫెబర్-కాజిల్ ఉత్పత్తులను పేర్కొనండి:....................................
....................................................................................

Send your entries to **CHANDAMAMA INDIA LTD.** B-3, LUNIC INDUSTRIES, CROSS ROAD 'B', MIDC ANDHERI (EAST), MUMBAI-400093, TEL : +91 22 28312872 / 28311849, Last Date: 30th April 2010. Judging of winners is at the sole discretion of Faber-Castell. Structure of gift hampers will be decided by **Faber-Castell (I) Pvt. Ltd**. Entries received will be the sole property of Faber-Castell **Paste the cartons (Front Panel) of the Faber-Castell Fabric colours & 3-Dimensional Outliners only. Kindly send your photographs with your entries.**



# దిగులుకు కారణం

పేదవాడైనా ఎంతో ఉత్సాహంగా, ఆనందంగా నవ్వుతూ వుండే రంగయ్య, ఈ మధ్య కొన్నాళ్ళుగా ముఖం ముడుచుకుని, దిగులుగా ఉండటం ప్రారంభించాడు.

రంగయ్యలో ఇంత పెద్ద మార్పు ఎందుకు వచ్చిందో తెలుసుకుందామని, అతడి మిత్రుడు సుబ్బయ్య ఒకనాడు, ''ఎన్నడూ లేంది, ఇంతగా మారిపోయావేం?'' అని అడిగాడు.

రంగయ్య ఒకసారి పెద్దగా నిట్టూర్చి, ''నీకు చెబుదామనుకుంటూనే మరిచాను, సుబ్బయ్యా! ఇంతకాలంగా లేనివాడినే కదా, పైకి నవ్వుతూ కనిపించినా పేదరికం వల్ల ఎన్ని బాధలు పడ్డానో నీకు తెలుసు. అయినా ఏ దిగులూ లేదు.

ఆ మధ్య మా పెదమామయ్య పోయాడు. రెండు లక్షల ఆస్తి కలిసింది. ఆయనకు పిల్లాజెల్లా లేరు. పది రోజుల క్రితం, పొరుగు గ్రామంలో ముసలావిడ మా మేనత్త పోయింది. ఆవిడ భర్త ఏనాడో పోయాడు. పిల్లాజెల్లా లేరు. ఒక లక్షవరకూ ఆస్తి నాకు వారసుడిగా దక్కింది,'' అన్నాడు.

ఆ జవాబుకు సుబ్బయ్య ఆశ్చర్యపడుతూ, ''మరి ఇలా ఆస్తి కలిస్తే సంతోషపడాలి గాని, దిగులుపడతా వెందుకు పిచ్చోడివిలా ఉన్నావే చూస్తుంటే?'' అని అడిగాడు.

ఈసారి రంగయ్య చిన్నగా మూలిగి, ''ఇక మా బంధుగణంలో పిల్లాజెల్లా లేని వాళ్లు ఎవళ్లూ లేరు!'' అన్నాడు.

– ఎం.డి. సౌజన్య



## బేతాళ కథలు

# స్వర్ణ పుష్పం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టు పైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, నువ్వు ఎంతో శ్రమపడి ఈ పని చేస్తున్నావు. చివరకు ఫలితాన్ని చేజేతులా వేరొకరికి దారపోయాల్సిన సందర్భం వస్తుంది. శ్రమ తెలియకుండా భీకరుడనే రాక్షసుడి కథ చెబుతాను విను'' అంటూ ఇలా చెప్పసాగాడు:

పూర్వం భీకరుడు అనే రాక్షసుడు, దండ కారుణ్యంలో ఉండేవాడు. వాడికి తెలిసిన విద్య మనుషులను తినటం. దొరకకపోతే ఇతర జంతువులను వేటాడి తినటం. అడవి గుండా ప్రయాణించే మానవులను తనకు ఆహారంగా చేసుకునేవాడు. కొంత కాలానికి ఈ అరణ్యంలో రాక్షసుడు సంచరిస్తున్నాడనీ, వాడు మనుషులను తినేస్తున్నాడని చుట్టు పక్కల ప్రాంతాలలో వ్యాపించటం వల్ల,



మరికొంత కాలానికి, భీకరుడు అపరాధ భావం భరించలేక, తాను చేసిన పాపానికి తగిన ప్రాయశ్చిత్తం చేసుకోవాలని మధనపడ సాగాడు.

ఇంతకాలం తాను గడిపిన జీవన విధానం మీద అతనికి పూర్తిగా వెగటు కలిగి, తన పాపం పోగొట్టుకునే ప్రయత్నం మొదలు పెట్టాడు. కాని పాప విముక్తికి అవలంభించ వలసిన మార్గాలు తెలియలేదు, ఎంత ఆలో చించినా ఆ రాక్షస బుర్రకు తట్టలేదు.

మామూలు మనుషులనైతే వేటాడి తినే వాడుకాని, ఆ అడవిలోనే ఎక్కడో దట్టమైన కీకారణ్యంలో తపస్సు చేసుకుంటూ ఉండే మునులు, ఋషుల జోలికి పోయేవాడు కాదు. వాళ్ళంటే తెలియని భయంవల్ల ఆ ప్రాంతానికి వెళ్ళేవాడుకాదు. ఈ విషయం గుర్తుకు వచ్చి భీకరుడు కొంత శాంతపడి, తన పాప విముక్తికి మార్గం చెప్పగల సరైనవారు మునులే అనుకున్నాడు.

అలా యోచించి, వారుండే ప్రదేశంకేసి బయలుదేరాడు. కొంతసేపటికి, ఓ మహావృ క్షం కింద ధ్యానంలో ఉన్న ఒక ముని అతని కంటబడ్డాడు. ఆ ముని పేరు చరితార్థుడు. భీకరుడు, మునీశ్వరుడికి కొద్ది దూరంలో కూచుని ఆయన జపం ఎప్పుడు పూర్తవు తుందా అని ఆత్రంగా ఎదురు చూడసా గాడు.

కొంతసేపటికి, చరితార్థుడు కళ్ళు తెరిచి భీకరుణ్ణి చూసి, ''ఏం రాక్షసా! ఇలా వచ్చావు, నన్నే తిందామనా!'' అన్నాడు. భీకరుడు తడబడుతూ, ''కాదయ్యా ఇప్పుడు అటు

ప్రజలు జాగురూకులై, ఆ అడవిగుండా ప్రయాణించటం మానుకున్నారు. కాకపోతే అప్పుడప్పుడూ ఈ విషయం తెలియని వారు ఆ అడవి మార్గాన రావటం, ఈ రాక్షసుడి పాల పడటం జరిగేది.

ఏది ఏమైనా, భీకరుడికి తనకిష్టమైన ఆహారం దొరకటం కష్టమైపోయి, అడవిలో పందులను, దున్నపోతులను వేటాడుకోవా ల్సిన పరిస్థితి ఏర్పడింది. ఈ విధంగా కొన్ని సంవత్సరాలు గడిచాయి.

భీకరుడికి వయసు మళ్ళి వృద్ధాప్యం వచ్చింది. వయస్సుతో వచ్చిన పరిణితివల్ల కాబోలు, భీకరుడు తాను ఇంతకుముందు మనుషులను వేటాడి తినటం, తాను తింటుండగా వాళ్ళు పడిన బాధ, గుర్తుకు వచ్చి తీవ్రంగా పశ్చాత్తాప పడేవాడు. తాను తిన్న మనుషులు గుర్తుకు వచ్చి ఆవేదన పొందేవాడు.

వంటి పాపపు పనులు చెయ్యటం లేదు, పూర్వం చేసిన దుష్ట చర్యలు నన్ను ఇప్పుడు బాధిస్తున్నాయి, పశ్చాత్తాపం కలిగింది. కాని, ఈ పాపం నన్ను వెంటాడుతుంది అనే భయంతో వణికిపోతున్నాను. మీరు ఏమన్నా తరుణో పాయం చెప్తారని ఆశపడి వచ్చాను'' అని మునికి సాష్టాంగ పడ్డాడు.

చరితార్థుడు అతని మాటలు ఓపికగా విని, ఈ రాక్షసుడిని అరణ్యం నుంచి వెళ్ళ గొట్టి, మళ్ళీ మనుషులు అక్కడ సంచరిం చేట్టుగా చెయ్యటానికి ఇదే మంచి అవ కాశం అని తనలో అనుకుని, చిరునవ్వుతో ''భీకరుడా! పశ్చాత్తాపాన్ని మించిన తరు ణోపాయం లేదు. కాని అడిగావు గాబట్టి చెబుతున్నాను.

హిమాలయ పర్వతాలలో ఉన్న ఓ హిమ సరస్సులో ఒక దివ్య స్వర్ణ పుష్పం పూస్తుంది. ఈ స్వర్ణ పుష్పం పరమేశ్వరుడికి ఎంతగానో ప్రీతిపాత్రం. నువ్వు కనుక ఆ స్వర్ణ పుష్పాన్ని సంపాయించి శంకరుడికి పూజ చెయ్యగలి గితే నీకు ముక్తి కలిగే అవకాశం ఉన్నది. ఇంకో విషయం, ఆ పుష్పం పాతిక సంవత్స రాలకు ఒక్కసారి మాత్రమే పూస్తుంది'' అని చెప్పాడు.

ఈ విషయం విన్న భీకరుడు, సంతోషంతో చేతులు జోడించి, ''మునీశ్వరా! మీరు చెప్పిన విషయం భేషుగ్గా ఉన్నది. కాని, ఆ పుష్పం ఏ సరస్సులో ఉన్నది కనిపెట్టడం ఎలా, హిమాలయాలలో సరస్సులు అనేకం అని, పైగా మంచుతో కప్పబడి ఉంటాయని విన్నాను'' అని తన సందేహం వెలిబుచ్చాడు.




''భీకరుడా! పుష్పం అన్నాక పరిమళం ఉండదా, పైగా ఇది దివ్య పుష్పం! కాబట్టి ఆ పరిమళం కొన్ని యోజనాల మేర విస్తరి స్తుంది. ఆ పరిమళం వస్తున్న దిశగా నువ్వు వెళ్ళగలిగావంటే, ఆ పుష్పాన్ని కనిపెట్టవచ్చు, అయితే ఆ స్వర్ణ పుష్పం వికసించడం కోసం సంవత్సరాల తరబడి నిరీక్షించాలి. అదంత సులభం కాదు. ఇక నువ్వు వెళ్ళి ఆ పనిలో ఉండటం మంచిది'' అన్నాడు.

మునీశ్వరుడు చెప్పిన మాటలు విని సంతోషంతో భీకరుడు హిమాలయాలకేసి తన ప్రయాణాన్ని మొదలుపెట్టి కొద్దికాలంలో అక్కడకు చేరాడు.

కొన్ని సంవత్సరాలు సాధుజీవనం గడిపిన పిమ్మట, ఒకరోజున భీకరుడి నాశికాపుటా లకు అద్భుతమైన పరిమళం సోకింది. ఆ సువాసన వస్తున్న వైపుగా, దివ్య పుష్పాన్ని అన్వేషిస్తూ, భీకరుడు ఆశగా బయలు

దేరాడు. అటూ ఇటూ తిరిగిన మీదట అతనికి దివ్యపుష్పం వికసించిన సరస్సు కనపడింది. ఆనందంగా సరస్సులోకి దిగి ఆ దివ్య పుష్పాన్ని కోసుకుని వద్దామని భీకరుడు అనుకునేంతలో, మరొక ఇద్దరు ఆ సరస్సు వద్దకు వస్తున్నట్టుగా భీకరుడు కనిపెట్టాడు. ఆ ఇద్దరిలో ఒకరు మంచి అలంకరణలతో, రాజోచితమైన దుస్తులతోనూ, మరొకతను సామాన్య వ్యక్తిలాగాను కనపడ్డాడు. ఆ ఇద్దరు వ్యక్తులూ సరస్సు దగ్గరగా వచ్చి, అక్కడ ఉన్న భీకరుణ్ణి చూశారు. అందులో రాజ దుస్తులు ధరించిన వ్యక్తి, తన కత్తి దూసి రాక్షసుడి మీదకు రాబోయాడు. రెండవ వాడు భయ కంపితుడయ్యి చేష్టలుడిగి స్థాణువుగా నిల బడిపోయాడు.

వాళ్ళను చూసి, భీకరుడు మందహాసం చేస్తూ, ''నరులారా! నన్ను చూసి భయపడ కండి. నా వల్ల మీకు ఏవిధమైన అపకారమూ జరుగదు. నేనిప్పటివరకు చేసిన పాపాలను కడిగేసుకోవటానికిగాను ఈ పుష్పం కోసం వచ్చాను. మీరెందుకు ఇక్కడికి వచ్చారు'' అని అడిగాడు.

ప్రశ్న విన్న ఇద్దరూ ఒకరి మొహం ఒకరు చూసుకున్నారు. ముందుగా రాజ దుస్తులు ధరించినతడు తనను తాను పరిచయం చేసుకుంటూ తన పేరు బుద్ధిశేఖరుడని చెప్పాడు. తాను సింహపురి రాజ్యం మంత్రి కుమారుడినని, తమ రాజ్యాన్ని పరిపాలిస్తున్న విక్రమాదిత్యుడు అనారోగ్యం పాలయ్యా డని, వైద్యులందరూ తమ తమ ప్రయత్నాలు చేశారని, కాని ఫలితం లేకపోయిందని ఆయన అనారోగ్యం వల్ల రాజ్యపరిపాలన వ్యవహారాలు సరిగ్గా చూడలేకపోతున్నాడని వివరించాడు.



‘‘రాజ్యంలో సరైన నాయకత్వం లేక దాదాపు అరాచక పరిస్థితులు ఏర్పడ్డాయి, పొరుగు రాజులు ఇదే సమయం అని రాజ్యాన్ని కాజేసే ప్రయత్నాల్లో ఉన్నట్టుగా గూఢచారులవల్ల తెలిసింది. చివరి ప్రయత్నంగా రాజవైద్యులు, హిమాలయాల్లో ఉన్న సువర్ణ పుష్పం ఈ సంవత్సరం వికసిస్తుంది, ఆ పుష్పాన్ని తమ వైద్యంలో వాడినట్టయితే, మంచి ఫలితం కనిపిస్తుంది అని చెప్పారు. అందుకని ఆ పుష్పాన్ని తీసుకు వెళ్ళటానికి వచ్చాను.’’ అని చెప్పాడు.

ఇక రెండో అతను కొంత తడబడుతూ, తన పేరు మాధవుడని, తాను తన తల్లి, సింహపురి పొరుగు రాజ్యమైన గిరిపుర రాజ్య వాస్తవ్యులమని తమకి జరుగుబాటు కష్టంగా ఉండి, తిండికి కూడ కటకటగా ఉన్నదని, ఎవరో హిమాలయాల్లో ఉన్న దివ్య పుష్పాన్ని సంపాయిస్తే తమ దారిద్ర్యం తొలగిపోతుందని చెప్పారని, తాను తన తల్లిని ఒక ఆశ్రమం సంరక్షణలో ఉంచి ఇక్కడకు పుష్పం కోసం వచ్చానని చెప్పి తలవంచుకున్నాడు.

వారి కథనాలు విన్న భీకరుడు, ‘‘నరులారా! నేను నా పాపాలు పోగొట్టుకొనే మార్గంగా ఈ పుష్పాన్ని తీసుకునేవెడదామని అనుకుంటున్నాను. కాని మనమందరమూ ఒకేసారి ఇక్కడకు వచ్చాం. ఇక్కడేమో ఒక్కటే పుష్పం ఉన్నది, మరొక పుష్పం వికసించటానికి పాతిక సంవత్సరాలు పడుతుంది ఏమి చేద్దామో ఆలోచించండి’’ అన్నాడు.

ఇది విన్న మంత్రి కుమారుడు, ‘‘చూడు రాక్షసా, నువ్వు ఇక్కడికి ముందు వచ్చావు,



అందరికంటే పుష్పాన్ని ముందుగా చూశావు. ఆ పుష్పం నీకు చెందటమే సముచితం. కాని ఈ పుష్పం వల్ల మా రాజ్యం మొత్తానికి ఉపకారం జరుగుతుంది.’’ అన్నాడు. మాధవుడు ఆదుర్దాగా ‘‘అయ్యో నాకు ఈ పుష్పం దొరికితే నా దరిద్రం తీరుతుందనుకున్నాను. జీవితం అంతా సుఖంగా గడిచిపోతుందని కలలు కన్నాను’’ అన్నాడు.

అన్నీ విన్నాడు భీకరుడు. గబగబా సరస్సులోకి దిగి దివ్య పుష్పాన్ని కోసి బయటకు వచ్చాడు. ఆ పుష్పాన్ని మంత్రి కొడుకుకి ఇచ్చాడు.

అతను పుష్పం తీసుకుని రాక్షసుడికి కృతజ్ఞతలు చెప్పి, వెళ్ళబోతూ మాధవుడివంక చూసి, ‘‘ఏమయ్యా మా రాజ్యానికి వస్తావా మంచి పని ఇప్పిస్తాను సుఖసంతోషాలతో బతకవచ్చు’’ అన్నాడు. మాధవుడు సంతోషంగా అతని వెంట వెళ్ళాడు.

వాళ్ళవంక తృప్తిగా చూస్తూ భీకరుడు, తాను చేసిన పాపాలకు ప్రాయశ్చిత్తం మిగిలిన తన జీవితం సవ్యంగా బతకటమే అని తలపోసి, అక్కడే ఉంటూ సన్మార్గంలో శేష జీవితాన్ని గడపటానికి నిశ్చయించుకున్నాడు.

ఈ కథంతా చెప్పిన శవంలోని బేతాళుడు, ''రాజా, భీకరుడు తన పాపాలను ప్రాయశ్చిత్తం చేసుకోవటానికి ఆ పుష్పం తీసుకోదలచి అక్కడకు వచ్చాడు, తల్చుకుంటే ఆ మానవులను చాలా తేలికగా ఓడించి తనపని తాను చేసుకోగలడు. మొదట పుష్పాన్ని చూసింది అతడే కాబట్టి స్వర్ణ పుష్పాన్ని భీకరుడే తీసుకోవచ్చని మంత్రి కుమారుడు కూడా అంగీకరించాడు.

అయినా ఆ పుష్పాన్ని తన చేతులారా కోసి మంత్రి కొడుకు చేతిలో ఎందుకు పెట్టాడు. అతడు ఓ రాజ్యానికి మంత్రి కుమారుడు అన్న గౌరవమా? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసీ చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు ''భీకరుడు, వయస్సువలన కొంత పరిణితి చెందినవాడు, పైగా పాపానికి ప్రాయశ్చిత్తం చేసుకునేందుకు బయలుదేరినవాడు, ఆ దివ్య పుష్పాన్ని తాను తీసుకున్నా, మాధవుడికి ఇచ్చినా, ఒక్కరికే ఉపయోగపడుతుంది. కాగా, తనకు ఉపయోగపడేది తన పాప ప్రక్షాళనకే కాని మరే ఉపయోగం లేదు. మాధవుడు వయస్సులో ఉన్నాడు, కష్టపడి తన్ను తాను పోషించుకుంటూ, తన తల్లిని చూసుకోవలసినది పోయి, ఇలా మహత్తుల వెంట మహిమల వెంట పడటం సముచితం కాదనుకున్నాడు. అదే పుష్పాన్ని మంత్రి కుమారుడికి ఇస్తే, రాజుగారి ఆరోగ్యం బాగుపడి రాజ్యంలో వేలాది మంది ప్రజల శ్రేయస్సు కాపాడినట్లవుతుంది. అందుకనే ఆ దివ్య పుష్పాన్ని రాజుగారి వైద్యం కోసం, మంత్రి కొడుక్కి ఇచ్చి పంపాడు భీకరుడు'' అని ముగించాడు విక్రమార్కుడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. -(కల్పితం)

*[ఆధారం: ''ఎస్. శివ నాగేశ్వరరావు'' రచన]*



15

# ఆర్య

## మాణిక్య ద్వీప అన్వేషణ

ఆడ తోడే లు మరిఘా ధర్మపిత కుమార్తె అని తెలిసిపోతుంది. పుట్టుకతోనే ఆమెకు సువర్ణద్వీప మాణిక్యం ఇవ్వబడుతుంది. అది బొంతకాకి క్లా శరీరంలో భద్రపర్చబడింది.



అతడి సవాలుకు
ఆశ్చర్యపడ్డాను.
అతడి సవాలును
స్వీకరించాను.

అతడు తీవ్రంగా పోరాడాడు.
అయితే నాది అనుభవం నేర్పిన
నైపుణ్యం. త్వరలోనే అతడిని
పడగొట్టాను.

అతడిని పైకి లేపాలని నేను
ప్రయత్నిస్తుండగా, అతడి ముఖంలో
మార్పులు గమనించాను. వాతావరణంలో
భయంకరమైన శబ్దం.

నా కుమారుడు కొత్త వ్యక్తిగా మారిపోయాడు. నా కేసి
విజయగర్వంగా చూసాడు.

తనతో ఆటాడించే
వ్యక్తి నేర్పని ఒక కొత్త ఎత్తును
కోతి నేర్చుకుంది!



అయితే అతడు దాన్ని ఎలా నేర్చుకున్నాడు?
ప్రభాత్, సలూంకి నుంచి పాఠాలు నేర్చుకున్నాడు.
సలూంకి అంటే సల్గాజీకి చెందిన పేరుమోసిన పిచ్చి మనిషే కదూ...
అవును. ప్రతి ఒక్క రాజుకీ సలూంకీ ఓ గొప్ప సంపద మరి.
అతడు అద్భుతమైన సాహస కృత్యాలు చేసేవాడు...
...ఓ రాత్రి, సలూంకీ తన అదృష్టం తలుపులు తెరిచాడు.
దయచేసి ఈ రాత్రికి నాకు ఆశ్రయం
సలూంకీ ఆమెపట్ల ఆకర్షితుడయ్యాడు. ఆమె యాచకురాలే అయినప్పటికీ, ఆమె నేత్రాలు గర్వంతో మెరిశాయి. ఆమె భుజం మీద ఉన్న బొంతకాకి అతడికేసి ద్వేష భావంతో చూసింది.
తర్వాత ఏం జరిగింది?
సలూంకి పక్షి లోపలకు చూసాడు.


అతడు మాణిక్యాన్ని చూశాడు. దాని శక్తులు అతడికి తెలియవు.


ఆ యువతి, తోడేలు నిద్రపోగానే సలూంకి ఆ కాకిని చంపడానికి గాను దాన్ని సమీపించాడు.


అప్పుడు జరిగిన ఘర్షణలో అతడు పొరపాటున ఆమెను పొడిచేసాడు.


తన నేరాన్ని గ్రహించగానే సలూంకీ భీతి చెందాడు. బొంతకాకిని, తోడేలును తన తలుపు బయటకు తోసేశాడు.
మరిఘా ఆ తోడేలు పిల్లేనా?
అవును.
(ఇంకా ఉంది)



# రామాయణం

## ఉత్తరకాండ – 2

లక్ష్మణుడు ఏమీ మాట్లాడలేక, ఏడుస్తూ సీతకు సాష్టాంగ నమస్కారం చేసి, ఆమె చుట్టూ ప్రదక్షిణం చేసి, పడవలో ఎక్కి ఉత్తర తీరానికి చేరుకుని, రథమెక్కి, అనాథ లాగా అవతలి ఒడ్డున ఏడుస్తున్న సీతను మళ్ళీ మళ్ళీ వెనక్కు తిరిగి చూస్తూ వెళ్ళి పోయాడు. సీత ఆ రథం కేసే చూస్తూ ఉండిపోయి, పట్టలేక గట్టిగా ఏడవ నారంభించింది.

ఆ నిర్జనారణ్యంలో ఒంటరిగా ఏడుస్తున్న సీతను కొందరు మునికుమారులు చూసి వాల్మీకి వద్దకు పరిగెత్తి వెళ్ళి, ''స్వామీ గంగా తీరాన ఎవరో ఒక స్త్రీ ఏ కారణం వల్లనో ఏడుస్తూ కనబడింది. మనిషి చూడబోతే ఆకాశం నుంచి దిగివచ్చిన దేవతా స్త్రీ లాగా ఉన్నది. ఆమె కెవరూ ఉన్నట్లు లేరు. మీరు వెంటనే వెళ్ళి ఒకసారి చూడండి,'' అని చెప్పారు. వాల్మీకి మహాముని, తన శిష్యులు వెంటరాగా, అర్ఘ్యం తీసుకుని సీత ఉన్న చోటికి వచ్చి, ఆమెను గుర్తించి, ''దశరథుడి కోడలికి స్వాగతం. అమ్మా, నీవిక్కడికి ఎలా చేరావో అది నేను నా శక్తిచేత గ్రహించాను. నేనుండగా నీకే భయమూ లేదు. నా ఆశ్రమం దగ్గిరలోనే ఉన్నది. అక్కడ తాపస స్త్రీలున్నారు. వారు నిన్ను కనిపెట్టి ఉంటారు. దుఃఖించకు. ఈ అర్ఘ్యం తీసుకో, మా ఆశ్రమంలో నీవు నీ సొంత ఇంట్లో ఉన్నట్లే ఉండవచ్చు,'' అన్నాడు.





సీత ఆయనకు నమస్కారం చేసి, వాల్మీకి వెంట ఆయన ఆశ్రమం ప్రవేశించింది. వాల్మీకి ఆమెను మునిభార్యలకు అప్పజెప్పి, ఆమెను స్నేహగౌరవాలతో చూడవలసిందని చెప్పాడు.

అయోధ్యకు తిరిగి పోతున్న లక్ష్మణుడు సుమంత్రుడితో ''మంత్రా, అన్నకు సీతా వియోగం వల్ల ఎంతటి దుఃఖం సంప్రాప్త మయిందో చూశావు గదా. నిర్దోషురాలైన సీతకు ఎంత కష్టం వచ్చిందో చూడు,'' అన్నాడు. సుమంత్రుడా మాటకు, ''లక్ష్మణా రాముడికి సుఖం అల్పమనీ, అయిన వారితో వియోగం కలుగుతుందనీ, పూర్వం మునులు చెప్పనే చెప్పారు. ఇది చాలా రహస్యం'' అంటూ ఇలా చెప్పాడు.

ఒకనాడు దశరథుడు వశిష్ఠుడి ఆశ్రమానికి వెళ్ళేసరికి అక్కడ అత్రి మహాముని కుమారుడైన దుర్వాసుడున్నాడు. దశరథుడు మునులనుంచి స్వాగత సత్కారాలు పొంది, మాటల సందర్భంలో దుర్వాసుణ్ని, ''మహాత్మా, నా సంతతి యొక్క భవిష్యత్తు ఎలా ఉండబోతుంది? మా రాముడి ఆయుర్దాయమెంత? మిగిలిన నా కొడుకులెంత కాలం జీవిస్తారు? మా రాముడికెంత కొడుకులుంటారు? వారెంత కాలం జీవిస్తారు?'' అని అడిగాడు. ఆ ప్రశ్నలకు సమాధానంగా దుర్వాసుడు ఒక పాత గాథ చెప్పాడు.

''దేవాసుర యుద్ధంలో ఓడిపోయి అసురులు భృగు మహాముని భార్యను శరణుజొచ్చారు. ఆమె వారికి అభయం ఇచ్చింది. ఇది చూసి విష్ణువు ఆగ్రహించి భృగుడి భార్య శిరస్సును తన చక్రాయుధంతో ఖండించాడు. వెంటనే భృగుమహాముని మండిపడి, విష్ణువును భూలోకంలో పుట్టి భార్యావియోగంతో తపించమని శపించాడు. ఆశాప ప్రభావం చేత విష్ణువు దశరథుడికి కొడుకుగా పుట్టి, రాముడనే పేరుతో ప్రసిద్ధి చెందాడు.

రాముడు భృగు శాపఫలం అనుభవించి తీరుతాడు. అతను పదకొండు వేల ఏళ్ళు అయోధ్యను పాలించి, అనేక అశ్వమేధాలు చేసి, బ్రహ్మలోకానికి పోతాడు. అతనికి ఇద్దరు కొడుకులు పుడతారు. అయితే వారు అయోధ్యలో గాక మరొక చోట పుడతారు. వారికి రాముడు పట్టాభిషేకం చేస్తాడు,'' అని దుర్వాసుడు దశరథుడితో చెప్పాడు.

ఇలా మాట్లాడుకుంటూ, లక్ష్మణ సుమంత్రులు సాయంకాలానికి గోమతి అనే చోటికి వచ్చి ఆరాత్రి అక్కడ గడిపారు. మర్నాడు

ఉదయం వారు తిరిగి ప్రయాణం సాగించి అయోధ్యకు వెళ్లేటప్పుడు లక్ష్మణుడు, రాముడితో ఏమని చెప్పడమా అని చాలా మధనపడ్డాడు.

రథం అయోధ్య చేరింది. రాముడి ఇంటి ముందు లక్ష్మణుడు రథం దిగి, లోపలికి వెళ్లి, దీనంగా కన్నీరు కార్చుతూ, సింహాసనం మీద కూర్చుని ఉన్న రాముడికి నమస్కరించి, ''మీ ఆజ్ఞానుసారం సీతను గంగా తీరాన వాల్మీకి మహాముని ఆశ్రమంలో విడిచి వచ్చాను. విచారించవద్దు. వృద్ధి నుంచి క్షయమూ, ఉన్నతి నుంచి పతనమూ, సంయోగం నుంచి వియోగం తప్పవు. వచ్చిన అపవాదు దానంతట అదే పోతుంది,'' అన్నాడు.

''లక్ష్మణా, నా మాట పాటించావు. చాలా సంతోషం. నాకు విచారమేమీ లేదు,'' అన్నాడు రాముడు. అప్పటికతను నాలుగు రోజులుగా ప్రజల గొడవలు విచారించలేదు. అది చాలా తప్పు. రాముడా సంగతి లక్ష్మణుడితో అని, అందుకు తార్కాణంగా నృగ మహారాజు కథ ఇలా చెప్పాడు.

పూర్వం నృగమహారాజు కోట్లకొద్దీ ఆవులను బ్రాహ్మణులకు దానం చేశాడు. ఆయన దానమిచ్చిన ఆవులలో ఒకటి ప్రమాదవశాన తిరిగి రాజుగారి ఆవులమందలలో కలిసిపోయింది. అది తెలియక రాజు దాన్ని మరొక బ్రాహ్మణుడికి దానమిచ్చాడు. మొదట దానం పుచ్చుకున్న బ్రాహ్మణుడు తన ఆవును వెతుక్కుంటూ తిరుగుతూ, కనఖలం అనే చోట రెండో బ్రాహ్మణుడి ఇంట తన ఆవును చూసి గుర్తించి, దానికి తాను పెట్టుకున్న పేరుతో పిలిచాడు. ఆ ఆవు తన పాత యజమాని గొంతు





గుర్తించి కట్టుతాడు తెంచుకుని, అతని వెంట బయలుదేరింది. అది చూసి రెండో బ్రాహ్మణుడు, ''నా ఆవును నువు తోలుకు పోతున్నావేమిటి? దీన్ని నాకు నృగమహారాజు దానమిచ్చాడు.'' అన్నాడు.

''ఆ నృగమహారాజే దీన్ని నాక్కూడా దానమిచ్చాడు, అన్నాడు మొదటి బ్రాహ్మణుడు. ఈ తగాదా వారిద్దరి మధ్యా పరిష్కారం అయేది కాదు గనక వారు తిన్నగా నృగమహారాజు వద్దకే వెళ్లారు. అయితే వారికి రాజదర్శనం ఎంతకూ కాలేదు. బయటి ద్వారం వద్ద రోజుల తరబడి పడిగాపులు కాయవలిసి వచ్చింది. చివరకు వాళ్లు ఆగ్రహించి ఊసర వెల్లి అయిపోయి ఎవరికంటా పడకుండా పడకుండా గోతిలో జీవించమని రాజును శపించారు. రాజు బతిమాలగా, యదువంశంలో వామదేవుడు పుట్టి శాపవిమోచనం కలిగిస్తాడని చెప్పి ఆబ్రాహ్మణులు వెళ్ళిపోయారు. తరవాత నృగమహారాజు వసువనే తన కుమారుడికి పట్టాభిషేకం చేసి, తాను ప్రజల కంట పడకుండా ఊసరవెల్లి జీవితం సుఖంగా గడపడానికి గాను కొన్ని గోతులు తవ్వించి వాటిమీద చెట్ల నీడా, వాటి చుట్టూ పూల మొక్కలూ ఏర్పాటు చేయించుకున్నాడు.

రాముడు లక్ష్మణుడికి నృగ మహారాజు కథ చెప్పి, ఆ తరవాత నిమి అనే వాడి కథ కూడా చెప్పాడు.

నిమి ఇక్ష్వాకు మహారాజు కొడుకులలో పన్నెండోవాడు. అతను ఒక దివ్యమైన పురం కట్టించి, ధానికి వైజయంతమని పేరు పెట్టాడు. అతను తన తండ్రికి సంతోషం కలిగించడానికై ఒక యజ్ఞం తలపెట్టి, వసిష్టుడిని ఋత్విక్కుగా ఉండమని కోరాడు. అయితే వసిష్టుడు తనను ఇంద్రుడు ముందుగానే యజ్ఞం చేయించమని కోరాడని, ఇంద్రుడి యజ్ఞం పూర్తి కాగానే తాను వచ్చి యజ్ఞం చేయిస్తానని చెప్పి వెళ్లిపోయాడు. అందుచేత నిమి గౌతముడిని పెట్టుకుని యజ్ఞం పూర్తి చేసేశాడు. ఇంద్రుడి యజ్ఞం పూర్తి కాగానే వసిష్టుడు తిరిగి వచ్చి, నిమి తన కోసం వేచి ఉండక గౌతముడి చేత యజ్ఞం పూర్తి చేయించుకున్నాడని తెలుసుకుని కోపం చెంది, రాజును చూడబోయాడు. సరిగా ఆ సమయానికి నిమి నిద్రపోతూ ఉండటం జరిగింది. వసిష్టుడు రాజదర్శనం కోసం కొద్ది సేవు చూసి, కావాలనే నిమి తనను వేచి ఉంచాడనుకుని, ''రాజా మరొకరి చేత యజ్ఞం చేయించు

కుని నన్నవమానించావు గనక నీ శరీరం నిశ్చేతనమగుగాక,'' అని శపించాడు.

తరవాత రాజు మేలుకుని వసిష్టుడిచ్చిన శాపం తెలుసుకుని, ''నిద్రపోయే నన్ను శపించిన నీ శరీరం కూడా చేతనం లేనిదై పోవు గాక,'' అని ప్రతిశాపమిచ్చాడు. ఇలా ఒకరినొకరు శపించుకుని నిమి వశిష్టులు 'విదేహు'లయిపోయారు. అప్పుడు వశిష్టుడు తన తండ్రి అయిన బ్రహ్మ వద్దకు వాయు రూపం ధరించి వెళ్లి ''తండ్రీ, నిమి శాపం వల్ల నా దేహం కాస్తా పోయింది. దేహం లేకపోవటం చేత నన్ను అనుగ్రహించి నాకు మరొక శరీరం కలిగేటట్టు చెయ్యి,'' అన్నాడు. బ్రహ్మ వసిష్టుడిని మిత్రావరుణుల తేజస్సుతో తిరిగి శరీరాన్ని సంపాదించుకొమ్మన్నాడు. ఆవిధంగా మరొక దేహాన్ని సంపాదించుకున్న వసిష్టుడే ఇక్ష్వాకువంశం వారికి పురోహితుడయ్యాడు.

ఇక నిమి సంగతి, నిమి శరీరాన్ని మునులు రక్షించి, దేహం పోయిన నిమి సమస్త ప్రాణుల కళ్లలోనూ ఉండేటట్టుగా, వరమిచ్చారు. తరవాత వారు నిమి దేహాన్ని మథించగా అందులో నుంచి ఒక పిల్లవాడు పుట్టి మిథి అని పిలవబడ్డాడు. అతని పేరనే మిథిలానగరం ఏర్పడింది. అతనికి జనకుడని కూడా పేరు. రాముడు చెప్పిన ఈ కథలు విని లక్ష్మణుడు, ''అన్నా, క్షత్రియుడై ఉండి కూడా నిమి వసిష్టుడి లాంటి మహాత్ముడి పట్ల ఎందుకు శాంతి వహించలేదు?'' అన్నాడు.

''రోషం మూలాన ఎలాటి వాడైనా శాంతిని కోల్పోవడం సహజం. అలా రోషాన్ని




నిగ్రహించుకున్న వాడు ఒక్క యయాతి మాత్రమే,'' అంటూ రాముడు లక్ష్మణుడికి యయాతి వృత్తాంతం ఈ విధంగా చెప్పాడు.

యయాతి నహుషుడి కొడుకు, అతనికిద్దరు భార్యలు. ఒకతె వృషపర్వ మహారాజు కుమార్తె అయిన శర్మిష్ట, రెండవది శుక్రాచార్యుడి కుమార్తె అయిన దేవయాని. కాని యయాతికి శర్మిష్టపైన ఉండే ప్రేమ దేవయాని పైన ఉండేది కాదు. అదేవిధంగా అతనికి శర్మిష్ట కొడుకైన పూరుడి పైన ఉన్నంత మమకారం దేవయాని కొడుకైన యదుడి పైన ఉండేది కాదు. నిజానికి పూరుడు మంచి గుణవంతుడు. ఆపైన శర్మిష్ట కొడుకు కూడానూ, తన తండ్రి పూరుడిపైన హెచ్చు ప్రేమ చూపటం సహించలేక యదుడు తన తల్లి అయిన దేవయానితో ''అమ్మా, శుక్రాచార్యుడంతటి వాడి కూతురివై ఉండి నువ్వూ, నీ కొడుకైన నేనూ అంత

అవమానాన్ని ఎందుకు సహించాలి? మన మిద్దరమూ అగ్నిలో దూకి ప్రాణత్యాగం చేద్దాం. ఈ అవమానాన్ని ఒకవేళ నువు సహించినా, నేను సహించలేను, ఆత్మహత్య చేసుకుంటాను, నాకు అనుజ్ఞ ఇయ్యి,'' అని పెద్ద పెట్టున ఏడ్చాడు.

కొడుకు దుఃఖం చూసి దేవయానికి రోషం వచ్చి, తన తండ్రిని తలుచుకున్నది, వెంటనే శుక్రాచార్యుడు వచ్చాడు. ''నా భర్త నన్ను చాలా లోకువగా చూస్తున్నారు. ఆ అవమానం భరించటం కష్టంగా ఉంది. నేను అగ్నిలో దూకో, విషం తినో, నీటిలో పడో ఆత్మహత్యం చేసుకుందామనుకుంటున్నాను,'' అన్నది దేవయాని తండ్రితో.

శుక్రాచార్యుడికి పట్టరాని ఆగ్రహం వచ్చి, యయాతి ముసలితనంతో జీవించమని శపించి, కూతురి నోదార్చి, ఇంటికి తిరిగిపోయాడు. శుక్రాచార్యుడి శాపాన్ని యయాతి ఎంతో సహనంతో స్వీకరించాడు.

అతను యదువును పిలిచి, ''నాయనా నేనింకా భోగాలతో తృప్తిపడలేదు. అందు చేత నా ముసలితనాన్ని నువు కొంత కాలం భరిస్తావా? నాకు భోగాలతో తృప్తి కలిగాక నీ యౌవనం నీకిచ్చి ముసలితనం తీసుకుంటాను,'' అన్నాడు. ''నీ సరసన భోజనం చెయ్యడానికి అర్హుడైన పూరుడండగా నీ ముసలితనాన్ని నేనెందుకు తీసుకోవాలి? వాడినే తీసుకోమను,'' అన్నాడు యదువు.

అప్పుడు యయాతి పూరుణ్ని పిలిచి యదువు నడిగినట్లే అడిగాడు. తన తండ్రి వార్ధక్యాన్ని స్వీకరించడానికి పూరుడు మన స్ఫూర్తిగా అంగీకరించాడు. యయాతి తన ముసలితనాన్నని పూరుడి కిచ్చి, వాడి యౌవనం తాను పొంది, అనేకవేల యజ్ఞాలు చేశాడు. చివరకతను తన కొడుకు నుంచి ముసలితనం తీసుకుని, వాడికే రాజ్యాభిషేకం చేసి, దేవయాని కొడుకైన యదువుకు రాజ్యార్హత లేకుండా చేశాడు. యయాతి అనంతరం పూరుడు ప్రతిష్ఠానపురం రాజధానిగా పెట్టుకుని చాలా కాలం రాజ్యం చేశాడు.

రామలక్ష్మణులిలా కథలు చెప్పుకుంటూండగానే రాత్రి గడిచిపోయింది. తూర్పున అరుణరేఖలు కనిపించాయి.





# పంచతంత్ర కథలు

## మిత్రభేదం-5

దమనకం చెప్పిన దంతిలుడి కథ విని సంజీవకం, ''నువు చెప్పిన కథ సరిగానే ఉన్నది. అందుచేత నువ్వన్నట్లే కానీ,'' అన్నది.

తరవాత దమనకం సంజీవకాన్ని పింగళకం వద్దకు తీసుకుపోయి, ''మహారాజా ఇదుగో సంజీవకం, ఆ పైన దేవరవారి చిత్తం,'' అన్నది.

సంజీవకం పింగళకానికి ప్రణామం చేసి, ఎంతో నమ్రతగా దాని ఎదట కూర్చున్నది.

పింగళకం వాడీ, భయంకరమూ అయిన గోళ్ళు గల బలమైన తన కుడి పంజా చాచి, ''స్వాగతం, నీ ఆరోగ్యం ఎలా ఉన్నది? ఈ అరణ్యానికి ఎందుకు వచ్చావు?'' అని అడిగింది.

తాను వర్ధమానుడి బిడారు వెంట వచ్చి ఒంటరిగా దిగబడిపోవటమూ, తరవాత జరిగినది యావత్తూ సంజీవకం సింహానికి చెప్పింది.

''మిత్రమా, నీకు ఎలాంటి భయమూ వద్దు. నువు నీ ఇచ్ఛానుసారం ఈ అరణ్యంలో జీవించు. కానీ మరీ దూరం పోకుండా ఎల్లప్పుడూ నా కనుచూపు మేరలో ఉండు.

ఎందుకంటే నిన్ను నేను కనిపెట్టి ఉండలేనప్పుడు నీకు అపకారం చేసే క్రూర మృగాలు, పాపభీతి లేనివి, ఈ అరణ్యంలో చాలా ఉన్నాయి, నా రక్షణలో ఉంటే నీకు ఈ అరణ్యంలో, ఏ ప్రమాదమూ సంభవించదు'' అన్నది పింగళకం.

సింహం అభయం ఇవ్వడంతో స్థిమిత పడిన సంజీవకం 'చిత్తం' అని చెప్పి, యమునా నదికి వెళ్లి, కడుపునిండా నీరు తాగి, వెనకటిలాగా యథేచ్ఛగా, నిర్భయంగా అరణ్యంలో సంచరించసాగింది.

రోజులు గడిచే కొద్దీ పింగళకానికి, సంజీవకానికీ మధ్య స్నేహ బంధం దృఢం కాజొచ్చింది. పింగళకం ప్రతిదీ సంజీవకంతో సంప్రదించేది. సంజీవకం చాలా తెలివైనది.





అది కరటకం, దమనకం మొదలైన వాటి రహస్య చర్యలు కనిపెట్టి, వాటిని గురించి పింగళకాన్ని హెచ్చరించింది. ఆ కారణంగా పింగళకం వాటిని దూరంగా ఉంచి, సంజీవకం చెప్పే సలహాలు మాత్రమే స్వీకరిస్తూ వచ్చింది.

దుర్బుద్ధితో సింహరాజు పంచన చేరి పబ్బం గడుపుకోవాలని కరటక దమనకాలు పన్నిన పథకం దీంతో ఎదురు తెరిగింది. తమ పథకం బెడిసికొట్టడంతో వాటిలో అంతర్మథనం మొదలైంది.

''అన్నా, కరటకం! మనం నిరాశ్రయుల మయిపోయాం. పింగళకానికి సంజీవకంతో కబుర్లు చెప్పడంలో ఎంత ఆనందంగా ఉందంటే, అతగాడు వేటకు కూడా పోవటం లేదు. అందుచేత మనకు బొత్తిగా తిండి లేకుండా పోయింది. ఏం చెయ్యాలి?'' అన్నది దమనకం.

''నువు వెళ్లి హెచ్చరించు, రాజులు విని పించుకోకపోయినా మంత్రులు హెచ్చరిం చాలి.

గడ్డితినే ఈ ప్రాణిని తగుదునమ్మా అంటూ రాజుకు పరిచయం చెయ్యటం నీదే బుద్ధి తక్కువ, తనకు మాలిన ధర్మం చేస్తే ఇలాగే ఉంటుంది'' అన్నది కరటకం.

''నిజమే, తప్పునాదే, స్వయంకృతా పరాధం రాజుది కాదు. స్వయంకతాప రాధాలు ఎలా చెరుపు చేసేదీ దేవశర్మ కథ చెబుతుంది గద!'' అన్నది దమనకం.

''ఎలాగెలాగూ?'' అని కరటకం అడి గింది.

దమనకం ఇలా చెప్పసాగింది:

**దేవశర్మ కథ:**

ఒక మారుమూల ప్రదేశంలో, జనపదా లకు దూరంగా ఒక మఠం ఉండేది. దేవశర్మ అనే యతి ఆ మఠంలో ఒంటరిగా ఉంటూ శివలింగాన్ని అర్చిస్తూ, ఉండేవాడు. అనేక మంది భక్తులు ఆ మఠానికి విలువైన వస్త్రాలు దానం చేసేవారు.

సర్వసంగ పరిత్యాగం చేసి యతి అయి నప్పటికీ, దేవశర్మకు బంగారం మీద భ్రాంతి ఉండేది.

ఒకనాడు ఆయన మారువేషం వేసు కుని, విలువైన వస్త్రాలన్నిటినీ మూట గట్టి దూరాన ఉండే నగరానికి తీసుకు పోయి, వాటిని బంగారానికి అమ్మి, ఆ బంగారాన్ని ఒక గుడ్డ సంచీలో పెట్టి, సంచీని తన చంకకు తగిలించుకుని, మఠానికి తిరిగి వచ్చాడు.

అటు పిమ్మట, ఆయన ఎవరినీ నమ్మక, రాత్రింబగళ్లు ఆ సంచీని తన చంకలోనే ఉంచుకునే వాడు.

సంపదను సాధించటం కష్టం. సంరక్షించడం కష్టం, అది పోవడం దుఃఖం, ఖర్చుకావడం దుఃఖం, దాని మూలమే ఖేదం, దాని ఫలితాలు విషాదం, అని ఊరికే చెప్పారా?

ఆషాఢ భూతి అనేవాడు దుర్మార్గుడు, పాపభీతి లేనివాడు. ఇతరులది కాజెయ్యడమే వాడి లక్ష్యం. దేవశర్మ చంకలో ఉండే బంగారం ఒకనాడు వాడి కంట పడింది. దాన్ని ఎలా కాజెయ్యడమా అని ఆలోచించాడు.

మఠం గోడలు రాతితో కట్టినవి కావటం చేత వాటికి కన్నం వెయ్యటం సాధ్యం కాదు. కిటికీలు చాలా ఎత్తున ఉన్నాయి. అందుచేత ఆషాఢ భూతి దేవశర్మ దగ్గిర శిష్యుడిగా చేరి, తియ్యటి కబుర్లతో ఆయనకు విశ్వాసపాత్రుడు కావాలనుకున్నాడు.

ఇలా అనుకుని ఆషాఢభూతి దేవశర్మ వద్దకు వె ళ్లి, ''పరమశివుడికి ప్రణామం!'' అంటూ ఆయన కాళ్లపై సాష్టాంగ పడ్డాడు.

తరవాత అతను దేవశర్మతో వినయంగా, ''మహాత్మా, జీవితసాగరం నిరుపయోగమైనది. సుఖాలు నిర్జల మేఘాలు. బంధు పుత్ర కళత్రాదులు కలలోని భ్రాంతి.

ఈ విషయం పూర్తిగా గ్రహించి మోక్ష మార్గం తెలుసుకోవడానికి తమ వద్దకు వచ్చాను, నన్ను కరుణించి మీ శిష్యుడిగా స్వీకరించి నాకు ముక్తిమార్గం ప్రసాదించండి'' అన్నాడు.



దేవశర్మ ఈ మాటలు విని, ''నాయనా ఇంత చిన్న ప్రాయంలో లౌకికలంపటాన్ని వదిలించుకున్న నీవు ధన్యుడవు. యౌవనంలో సాధించిన నిగ్రహమే నిజమైన నిగ్రహం. ఈ నిగ్రహబలమే నిన్ను మనుషులలో ఉన్నతుడిని చేస్తుంది.

జీవితంపై ఆశలు లేని నువ్వు నన్ను మోక్షమార్గం అడిగావు. ఓం నమశ్శివాయ అంటూ శివుడిపైన ఒక్క పుష్పం ఉంచినవాడికి మరి జన్మ లేదు,'' అన్నాడు.

ఆషాఢభూతి దేవశర్మ కాళ్ళు పట్టుకుని, ''స్వామీ, ఆ మంత్రం ఎలా పునశ్చరణ చేయాలో చెప్పి, నన్ను ధన్యుడిని చెయ్యండి,'' అన్నాడు.

''చెబుతాను, నాయనా, అయితే నువు రాత్రివేళ మఠంలోకి రాగూడదు. యతి ప్రాపంచిక బంధాలకు దూరంగా ఉండాలి. అందుకు గాను రాత్రివేళ ఒంటరిగా ఉండటం

అవసరం. ఉపదేశం పొందిన అనంతరం నువు బయట ఉన్న పర్ణకుటీరంలో పడుకో గురువాజ్ఞను ఎన్నటికీ మీరకు,'' అన్నాడు దేవశర్మ.

ఆషాఢభూతి. ''స్వామీ, తమ ఆజ్ఞ శిర సావహిస్తాను,'' అన్నాడు.

ఆరాత్రి పడుకోబోయేముందు దేవశర్మ ఆషాఢభూతికి మంత్రోపదేశం చేసి, అతన్ని తన శిష్యుడుగా చేర్చుకున్నాడు.

అతను రోజూ గురువుగారికి కాళ్లూ చేతులూ పట్టి, పూజకు వూలూ, పత్రీ తెచ్చి పెట్టి సంతోష పరిచేవాడు. అయినప్పటికీ దేవశర్మ తన చంకలో ఉండే సంచీని ఆషాఢ భూతికి అందనిచ్చే ధోరణి ఏమీ కనబరచ లేదు.

కాలం గడుస్తున్నది. ఈ మనిషి నన్ను పూర్తిగా ఎప్పటికీ నమ్మడా? పట్టపగలే ఇతన్ని హత్య చేయాలా? లేక విషం పెట్టనా? లేక గొడ్డును చంపినట్లు కొట్టి చంపనా? అనుకున్నాడు ఆషాఢభూతి. బంగారం కోసం దేనికైనా తెగించడానికి సిద్ధపడి పోయాడు ఆషాఢభూతి. ఈ లోగా అవకాశం రానేవచ్చింది.

ఒకనాడు ఒక భక్తుడి కొడుకు వచ్చి, దేవశర్మను మర్నాడు తమ ఇంట జరిగే యజ్ఞోపవీత ధారణకు దయచెయ్యమని ఆహ్వానించాడు. ఆ ఆహ్వానాన్ని మన్నించాడు దేవశర్మ.

మర్నాడు దేవశర్మ ఆషాఢభూతిని వెంట బెట్టుకుని, ఆహ్వానం వచ్చిన గ్రామానికి బయలు దేరాడు. వాళ్లు కొంత దూరం వెళ్లే సరికి ఒక నది వచ్చింది.

దేవశర్మ నదిని చూడగానే తన బట్టలు విప్పి, చంకలోని సంచీ తీసి బట్టల మధ్య చుట్టిపెట్టాడు.

స్నానం చెయ్యబోతూ, కాలకృత్యాలు నిర్వర్తించవలసిన అవసరం వచ్చి, ''ఆషాఢ భూతీ, ఇప్పుడే వస్తాను. అంత దాకా ఈ బట్టలూ, ముఖ్యంగా ఈ సంచీ చూస్తూ ఉండు. అది శివుడి సొత్తు! అన్యులపాలు కానివ్వకు'' అని చెప్పి వెళ్లిపోయాడు.

దేవశర్మ కనుమరుగైన దాకా ఉండి, బంగారం ఉన్న సంచీ సంగ్రహించి, కాలి సత్తువ కొద్దీ పారిపోయాడు ఆషాఢభూతి.







# సాలీడు - గొల్లభామ

ఘనాలోని ఒయాంకోపన్ దేవుడు ఎల్లప్పుడూ చాలా సంతోషంగా ఉండేవాడు. ప్రపంచంలోకెల్లా అతి పెద్ద చిలగడదుంపల పొలాలకు అతడు అధినాథుడు. తన పొలంలో సమృద్ధిగా పండే చిలగడదుంపల పంటను చూడటానికి ప్రజలు తండోపతండాలుగా వచ్చేవారు.

పంట కోతల కాలం సమీపిస్తోంది. ప్రపంచంలోని ప్రతిఒక్కరినీ ఉద్దేశించి ఒయాంకోపన్ తన పంట గురించి ప్రకటన చేశాడు. ఆ వార్త విని అందరూ సంతోషంతో ఉప్పొంగిపోయారు. ప్రజలు, జంతువులు సైతం ఈ వార్త గురించి ముచ్చటించుకుని పంట చూసే తరుణంకోసం వేచి ఉండసాగారు.

అయితే, ఒకే ఒక్క ప్రాణికి ఈ విశేషమైన పంట గురించి సంతోషం లేకపోయింది. అది మరెవరో కాదు. సాలెపురుగు అనాన్సీ! అది తన ఇంటిలో కూర్చుని విస్తారమైన పొలంకేసి చూస్తూ ఉంది.

''నాకు మాత్రమే ఈ దుంపలన్ని దక్కేటట్లయితే ఎంత బావుండు! నా కుటుంబం, నేను జీవిత కాలం పొడవునా దుంపలను తిని బతికేవారం కదా!'' అనుకుంటూ విచారించింది అనాన్సీ.

మెరుపువేగంతో అది ఒక ఆలోచనకు వచ్చింది. ''అవును నేను దుంపలను దొంగిలిస్తాను, పంట కోతకు రావడానికి ఇంకా నెలరోజుల సమయం ఉంది కదా!''

సాయంత్రం పూట ఎవరూ లేనిది చూసి అనాన్సీ ప్రతిరోజూ కొన్ని దుంపలను తెంపి ఇంటిలోకి చేర్చడం మొదలెట్టింది. ఇంట్లో దుంపల మోపులు పెరిగేకొద్దీ పొలంలో పంట తగ్గనారంభించింది. తన విలువైన పొలంలో ఏం జరుగుతోందో ఒయాంకోపన్ గమనించ లేదు. ప్రతిరోజూ అనాన్సీ దుంపలను మోసుకుని ఇంట్లో ఉంచుతోంది.

ఒకరోజు, ఒయాంకోపన్ పంటకోతలకు ముందే తన పొలాన్ని చూసిరావాలని అనుకున్నాడు. పొలంవద్దకు వచ్చిన అతడు దిగ్భ్రాంతితో చూస్తూండిపోయాడు. ఎవరో వందలాది దుంపలను తన పొలంలోంచి తస్కరించారు. దాదాపు సగం పొలం బీడు పోయింది.

ఒయాంకోపన్ ఆగ్రహంతో కంపించిపోయాడు. తన రాజ్యంలోని అన్ని ప్రాణులను, ప్రజలను పిలిపించి దుంపలు ఎవరు తీసుకుపోయారో చెప్పమని నిగ్గదీసి అడిగాడు. అయితే వారందరూ ముక్తకంఠంతో తమకేమీ తెలియదని చెప్పారు.





ఆ మర్నాడు ఉదయం అనాన్సీ రాజసంగా పొలంలోకి అడుగుపెట్టింది. పొలంలో తిరగ నారంభించింది. ఇంతలో దాని ఒక కాలు ఉచ్చులో తగులుకుంది.

ఛట్!

అనాన్సీ దొరికిపోయింది. తన ఎనిమిది కళ్లను అది నమ్మలేకపో యింది! ఉచ్చులో ఉండగానే తనను ప్రజలు చూశారంటే బతికే యోగం ఉండదు. అది ఉచ్చులోంచి తప్పిం చుకోలేకపోయింది. రాత్రి భారంగా గడిచింది. తెల్లవారింది. సూర్యుడు ఉదయించే కొద్దీ అనాన్సీలో వణుకు మొదలైంది. తెల్లారిపోయింది కాబట్టి ప్రతి ఒక్కరూ పొలానికి వచ్చే వేళ సమీపించింది.

ఆ సమయంలో ఓ గొల్లభామ ఆనందంగా పాడుకుంటూ ఆ దారి వెంబడి రావడం సాలీడు గమనించింది. సాలీడు తన కళ్లు నులుముకుని ఆనందంగా దానికేసి చేయి ఊపింది.

''ఏయ్ మాంటిస్! త్వరగా రా... యుగా లుగా నేను వేచి ఉంటున్నా,'' అరిచింది సాలీడు.

''ఏమిటీ? నాకోసం వేచి ఉన్నావా?'' అయోమయంతో అడిగింది గొల్లభామ.

''నాకు విశ్రాంతి కలిగించడానికి వచ్చావు కదూ?'' అడిగింది అనాన్సీ.

గొల్లభామ తీక్షణంగా అనాన్సీ కేసి చూసింది. ''నువ్వేం మాట్లాడుతున్నావు.''

అనాన్సీ తల అడ్డంగా ఊపింది. ''ఏమిటీ? ఇక్కడేం జరుగుతోందో నీకు తెలీదా? ఒయాం కోపన్ దేవుడి దుంపలను ఎవరో తస్కరిస్తున్నారు. ఉద్దేశ్యపూర్వకంగా ఎవరో ఈ పని చేస్తున్నారు'' చెప్పింది అనాన్సీ. ''రాజ్యంలోని ప్రతి ఒక్కరూ

అప్పుడు అక్కడ చేరినవారందరూ కళ్ళలో ఒత్తులు వేసుకుని కాపు కాయవలసిందిగా ఒయాంకోపన్ ఆదేశించాడు. ''ఏవిధంగా అయినా సరే దొంగను పట్టి తీరతాను'' అని అతడు ఆగ్రహంతో చెప్పాడు''

ఆ సాయంత్రం, ప్రజలు, జంతువులూ దేవుడి పొలంలో కాపలా కాశారు. అయితే తెలివిమీరిన అనాన్సీ అంత సులభంగా పట్టు బడే రకం కాదు. ఎవరి కంటా పడకుండా అది దుంపలను ఆ రోజు కూడా మోసుకుపోయింది.

మర్నాడు ఉదయం తమ కళ్లముందే ఎవరో దుంపలు తెంపుకుని పోయినవిషయం పొలా నికి కాపలా ఉన్న వారు తెలిపారు. తర్వాత కూడా చాలారోజులు ఇలాగే జరిగింది. ప్రతిసారీ దొంగ వారికి మస్కా కొట్టి తప్పించుకున్నాడు.

''మనం పొలం మొత్తంలో ఉచ్చులు వేస్తే బాగుంటుందేమో!'' అని సూచించింది ఏనుగు. ఇతర జంతువులు అంగీకార సూచకంగా తల లూపాయి.

పొలంపై ఓ చూపు వేసి కాపు కాస్తున్నారు తెలీదా?''

గొల్లభామ నవ్వింది. ''నాకీ విషయం అస్సలు తెలీదు.''

అనాన్సీ తన ఖాళీ కాలుతో గొల్లభామను తట్టి చెప్పింది. ''అలాగయితే తప్పు లేదులే. ఇక్కడికి వచ్చి నీ వంతుగా పొలానికి కాపలా కాయి మరి. నిన్ను చూస్తే ఒయాంకోపన్ దేవుడు గర్విస్తాడు!''

అమాయకపు గొల్లభామ నమ్మేసింది.

నువ్వు చేయవలసిందల్లా నా కాలును ఈ పరికరంలోంచి తొలిగించి నీ కాలుకు తగిలించుకోవడమే..'' చెప్పింది అనాన్సీ మెత్తగా.

అప్పుడు గొల్లభామ అనుమానంగా చూసింది. ''అది ఉచ్చులాగ ఉన్నట్లుందే'' అడిగేసింది.

అనాన్సీ ఆగ్రహంతో చూసింది. ''సరే. నా స్థానంలో వచ్చి కాపలా కాయడానికి మరో వ్యక్తిని నేను వెతుక్కుంటాను. ఒయాంకోపన్ దేవుడు ఏ క్షణంలో అయినా ఇక్కడికి రావచ్చు. ఇక్కడ కాపలా కాస్తున్న సంరక్షకుడిని అతడు తప్పక ఆశీర్వదిస్తాడు....''

అప్పుడు గానీ గొల్లభామ బుట్టలో పడలేదు. ఒయాంకోపన్ దేవుడు తనను ప్రశంసిస్తూ, భుజం తడతాడంటే ఎంత అద్భుతమో అనుకుంటూ అది మైమరిచి పోయింది.

''నిన్ను సందేహించినందుకు క్షమించు'' అని చెప్పిన గొల్లభామ అనాన్సీ కాలిని బంధనంలోంచి తొలగించి తన కాలును ఆ ఉచ్చులో పెట్టుకుంది.

అనాన్సీ బతుకుజీవుడా అనుకుంటూ మెరుపు వేగంతో అక్కడినుంచి పరుగెత్తిపోయింది.

తర్వాత ఒయాంకోపన్ దేవుడు, ఇతర ప్రాణులు పొలంలోకి వచ్చే సమయానికి, ఏదో జరగరాని తప్పు జరిగిపోయిందని గొల్లభామ గ్రహించింది. అది భయంతో వణికిపోసాగింది. వాళ్ల చేతుల్లో పొడవాటి కర్రలున్నాయి.

ఎవరూ తాను చెప్పేది వినిపించుకోరని భయపడుతున్నప్పటికీ గొల్లభామ జరిగిందంతా చెప్పేసింది. ఒయాంకోపన్ మాత్రం నమ్మాడు. ''అంటే ఆ కొవ్వు పట్టిన అనాన్సీ గాడిద ఏమీ తెలీని ఈ గొల్లభామను ఉచ్చులో ఇరికించి తప్పించుకుందన్నమాట!'' అంటూ ఆగ్రహంతో ఊగిపోయాడు.

తర్వాత అమాయక గొల్లభామను విడిచిపెట్టి అనాన్సీకోసం వెతకమని ఒయాంకోపన్ ఇతర ప్రాణులను ఆదేశించాడు. అయితే ఈ మొత్తం పరిణామాలతో గొల్లభామ ఎంత భయపడి పోయిందంటే రోజుల తరబడి దానికి వణుకు తగ్గలేదు. దాని శరీరం అలా భయంతో వణుకుతూ ఉంటడం ఈనాటికీ మీరు చూస్తుంటారు. ఆ సంఘటన కలిగించిన భీతినుంచి అది ఇంకా కోలుకోలేదు. పాపం, గొల్లభామ!

– పునఃకథనం : రమా రమేష్



# ఫోటో వ్యాఖ్యల పోటీ

ఈ ఫోటోలకు ఒక్కమాటలోగాని, చిన్న వాక్యంలోగాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.



KALANIKETAN BALU

KALANIKETAN BALU





**Editor, CHANDAMAMA INDIA LTD.,**

B-3, Lunic Industries, Cross Road 'B', MIDC, Andheri (East), Mumbai-400093.

వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 25వ తేదీలోగా మాకు అందేలా పంపాలి. పోటీ ఫలితాలు జూన్ 2010 సంచికలో ప్రచురిస్తాం. ఉత్తమమైన వ్యాఖ్యకు రూ.100/- బహుమానం.

## అభినందనలు

కె. నాగరాజు
లక్ష్మీపతి పాన్ షాప్
మల్లిక బుక్ షాప్ పక్కన
పాత బస్టాండ్, మార్కాపురం,
ప్రకాశం జిల్లా - 523316
ఆంధ్రప్రదేశ్.

### ఫోటో వ్యాఖ్యల పోటీ:





నడిచి నడిచి నీరసించా!
నడిపి నడిపి నేర్చుకుంటా!!

## చందమామ లోకజ్ఞానం క్విజ్-13 ఫిబ్రవరి 2009 సమాధానాలు

1. ఫిబ్రవరి 21, 2. కొంకణి, 3. అస్సామీస్, 4. హిందీ, 5. హిందీ, ఉర్దూ, బెంగాలీ, 6. పంజాబీ, 7. సంస్కృతం

*గమనిక: సరైన సమాధానాలు గల ఎంట్రీలు రాలేదు గనక బహుమతులు ఇవ్వలేకపోతున్నాము.*

# వేగసూత్రం

ఈ నెల సమస్య:



ఎ, బి, సి, డి, ఇ లు ఓ కార్ల పరుగుపందెంలో పాల్గొంటున్నారు. ఎ గంటకు 80 కిలోమీటర్ల వేగంతో పోతుండగా, బి 96 కిలోమీటర్లు, సి 50 కి.మీ, డి 65 కి.మీ, డి 60 కి.మీ వేగంతో ప్రయాణిస్తున్నారు. ఎ. వేగానికి, వీరిలో అతివేగంగా పోతున్న వారికి మధ్య వ్యత్యాసం ఎంత? (అన్ని పరివర్తనలను మొత్తం సంఖ్యకు సమీపంగా తీసుకురండి) దీనిని మాన్యువల్‌గా వేగంగా లెక్కించడం ఎలా?

*గమనిక: ఈ సమస్యకు పరిష్కారం జూన్ సంచికలో ప్రచురించబడుతుంది.*

మీ వేగసూత్రాన్ని ఏప్రిల్ 30వ తేదీ లోగా మాకు రాసి పంపండి. అత్యంత వేగవంతమైన సూత్రానికి బహుమతి రూ.500. విజేతలు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నట్టయితే ఒక్కొక్కరికి రూ.100/- ఇవ్వబడుతుంది. మీ ఎంట్రీలను పంపవలసిన చిరునామా:

**Editor, CHANDAMAMA INDIA LTD.,**

B-3, Lunic Industries, Cross Road 'B',MIDC, Andheri (East), Mumbai-400093

or e-mail your entries to:contests@chandamama.com

---

ఫిబ్రవరి నెల సమస్యకు సరైన సమాధానాలు రానందున బహుమతి ఇవ్వలేకపోతున్నాము.

ఫిబ్రవరి నెల సమస్యకు సరైన సమాధానం:

*దశ 1:* నిరక్షరాస్యుల మొత్తం సంఖ్యను లెక్కించండి.

1-4 గ్రామాల్లోని నిరక్షరాస్యుల సంఖ్య
= 600 X 4= 2400

5-9 గ్రామాల్లోని నిరక్షరాస్యుల సంఖ్య
= 800 X 5= 4000

10వ గ్రామంలోని నిరక్షరాస్యుల సంఖ్య
= 371

11-13 గ్రామాలలోని నిరక్షరాస్యుల సంఖ్య
= 200 X 3= 600

మొత్తం నిరక్షరాస్యులు = 7371

*దశ 2:* ప్రతి గ్రామంలోని సగటు నిరక్షరాస్యుల సంఖ్య
7371/13

సమస్య పరిష్కారం కష్టంగా కనిపిస్తోందా? కింది దశలను అనుసరించి 7371 సంఖ్య 13తో భాగించబడుతుందేమో చూడండి.

1. సంఖ్య యొక్క చివరి డిజిట్‌ను వేరు చేయండి, దానిని 4తో గుణించండి (13 కోసం ఆపరేటర్), ఫలితాన్ని మిగిలిన సంఖ్యకు కూడండి.
   ఉదా : 737+(1 X 4)= 737+4=741
2. ఫలితం కోసం ఇదే ప్రక్రియను తిరిగి చేయండి.
   ఉదా: 74+(1 X4)= 74+4 = 78
3. ఈ ఫలితం కోసం కూడా ఇదే ప్రక్రియను తిరిగి చేయండి. ఉదా: 7+(8 X4)= 7+32= 39

39 మనందరికీతెలిసినట్లుగా 13తో భాగించబడుతుంది. అందుచేత, 7371 సంఖ్య 13చే భాగించబడుతుంది. కింది తనిఖీ లేకుండానే మీరు సరైన సమాధానం పొందినప్పటికీ, 13ను భాగించేటప్పుడు మీకు ఈ చిట్కా బాగా ఉపయోగపడుతుంది. ఇది మీరు సరైనవిధంగా భాగించేలా చూస్తుంది. మీ సమాధానాన్ని మళ్లీ పరిశీలించుకోవచ్చు.

సేకరించినసగటుమొత్తం= 567X100=రూ.56,700

# చందమామ లోకజ్ఞానం క్విజ్ - 15

(పదహారేళ్ళ లోపు పిల్లలకు)

***Co-sponsored by Infosys FOUNDATION, Bangalore***

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి రూ. 250లు.*

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నట్టయితే ఒక్కొక్క విజేతకు 50 రూ.లు బహుమతిగా ఇవ్వబడుతుంది.

మీరు చేయవలసిందేమంటే :

1. సమాధానాలు రాయండి.
2. మీ పేరు, వయసు( 16 ఏళ్ళలోపు ఉండాలి) పిన్ కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి.
3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి.
4. కవరు మీద చందమామ లోకజ్ఞానం క్విజ్ - 15 అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి.
5. ఏప్రిల్ నెలాఖరులోగా మీ ఎంట్రీ మాకు అందాలి.
6. జూన్ 2010 సంచికలో ఫలితాలు వెలువడుతాయి.

## భారతీయ సంగీత విశేషాలు!



1. సంగీతానికి అతి పురాతన సంస్కృత పేరు ఏది?
2. భారతీయ సాంప్రదాయిక సంగీతంలోని రెండు రకాలు ఏవి?
3. ఓఢ్ర మగథగా పిలువ బడుతున్న ప్రాంతం నుంచి పుట్టిన భారతీయ సాంప్రదాయిక నృత్యం ఏది?
4. 15వ శతాబ్దిలోని ఏ సంగీతకారుడిని కర్నాటక సంగీత పితామహుడుగా పిలుస్తున్నారు?
5. భక్తి సంగీతంలో ఓ భాగమైన సుఫియానా కలం ప్రత్యేకించి ఓ భారతీయ రాష్ట్రంలో పాడుతుంటారు. ఆ రాష్ట్రం పేరు ఏమిటి?
6. జాకీర్ హుస్సేన్ వాయించే సంగీత వాయిద్యం పేరేమిటి?
7. భారతీయ తంత్రీ వాయిద్యం ఏమిటి?

## చందమామను ఇంటికి తెప్పించుకోండి!

న్యూస్ పేపర్ వేసే డెలివరీ మ్యాన్ ద్వారా రెగ్యులర్‌గా చందమామను తెప్పించుకోవచ్చు. స్థానిక న్యూస్ స్టాండ్స్ నుంచి, లీడింగ్ బుక్ షాప్స్ నుంచి చందమామను కొనుక్కోవచ్చు. చందా వివరాలకు **www.chandamama.com** లాగాన్ చేయండి.



# సాదా నీటి పంపు తయారీ విధానం

ఏమేం కావాలి?



- 30 సెంటీ మీటర్ల పొడవు వీవీసి పైపు లేదా బొప్పాయి బుర్ర
- ఒక బకెట్ నీళ్లు

తయారు చేయడం ఎలా?

- నీళ్లతో బకెట్ నింపండి. పంపు లేదా బుర్రని మీ ఎడమ చేతితో పట్టి ఉంచి దాన్ని బకెట్ లోని నీళ్లలో పైకీ, కిందికీ జరపండి.
- మీ కుడి అరచేతిని పైప్ లేదా బుర్ర పై భాగాన మోపి పైపు ద్వారాన్ని చేతితో తెరుస్తూ, మూస్తూ ఉండండి.
- మీరు చూస్తుండగానే ఓ అద్భుతం జరుగుతుంది. త్వరలో, మీరు పైపు నుంచి నీళ్లు పైకి చిమ్మబడటం చూస్తారు.

కాన్సెప్ట్:

ఇక్కడ, ఎడమచేతితో పైపును పైకీ కిందికి జరపటం అనేది నీళ్లను పైకి చిమ్మటానికి తోడ్పడగా, కుడి అరచేయి కవాటం లాగా పని చేస్తుంది.



గొట్టం నీటిలో మునుగుతున్నప్పుడు కుడి అర చేయి తెరుచుకోవడం వల్ల గాలి పైకి వచ్చి పైపులో నీటి మట్టం పెరుగుతుంది. గొట్టం పైకి లేపినప్పుడు కుడి అరచేయి మూసుకుంటుంది. అందుచేత, గొట్టంలోని నీళ్లు కిందికి పోకుండా ఉంటుంది.

*రచన: అరవింద గుప్తా (పూణెలోని ఇంటర్ - యూని వర్శిటీ సెంటర్ ఫర్ ఆస్ట్రానమీ అండ్ ఆస్ట్రో ఫిజిక్స్ భాగంలో విజిటింగ్ సైంటిస్టుగా పనిచేస్తున్నారు.)*



# శాస్త్రజ్ఞానం-లోకజ్ఞానం

రామాపురంలో రంగనాథుడనే వైద్యుడుండేవాడు. ఆయుర్వేదం ఆయనకు కొట్టిన పిండి. ఎవరెవరి శరీర తత్వాన్ని బట్టి, జీవనశైలిని బట్టి, వారికి ఏయే వయసులో, ఏయే రుగ్మతలు వచ్చే అవకాశముందో ఇట్టే చెప్పేసేవాడు.

తన దగ్గరకు వచ్చే రోగుల వాలకాన్ని బట్టి, వారు చెప్పక ముందే వారి బాధేమిటో, దానికి మూలకారణమేమిటో కూడా చెప్పి, వారిని ఆశ్చర్యపరిచేవాడు. ఆ కారణంగా అతడికి వైద్యం బాగా ఎరిగినవాడనే పేరొచ్చిందికానీ, రోగులు మాత్రం అంతగా వచ్చేవారుకాదు.

ఒకనాడు, దూర ప్రాంతానవుంటున్న చరకాచార్యుడనే గురువు, రంగనాథుణ్ణి చూడడానికి వచ్చాడు. ఆ సమయంలో ఒక స్త్రీ రంగనాథుడి దగ్గిరకు వచ్చి, ''అయ్యా! నా వయసు ఇరవై ఏళ్ళు. ఇంత చిన్న వయసులోనే, వచ్చిన రోగమేమిటో అంతు బట్టకుండావుంది...'' అని ఇంకా ఏదో చెప్పబోతూండగానే, రంగనాథుడు ఆశ్చర్య పోతూ, ''నీ వయసు ఇరవై ఏళ్ళేమిటమ్మా? ఎంతలేదన్నా ఇరవై ఎనిమిదేళ్ళకు తక్కువుండదు,''అన్నాడు.

ఆ మాట వింటూనే వచ్చిన స్త్రీ ముఖం మటమటలాడించుకుంటూ గిరుక్కున వెనుదిరిగి వెళ్ళిపోయింది.

రంగనాథుడు, తన గురువు చరకాచార్యుడి కేసి తిరిగి, ''ఏమిటో, గురువర్యా! వచ్చిన రోగుల్లో కొందరు మధ్యలో చిరాగ్గా తిరిగి వెళ్ళిపోతున్నారు,'' అన్నాడు.

దానికి చరకాచార్యుడు నవ్వి, ''తెలుస్తూనే వుందిగదా, రంగనాథా! నీకు శాస్త్ర జ్ఞానమైతే వుంది కానీ; లోకజ్ఞానం కొరవడింది. వచ్చిన వాళ్ళతో నిజం చెప్పినా వాళ్ళు బాధపడేలా కాకుండా లౌక్యంగా చెప్పడం అవసరం కదా!'' అన్నాడు. – జి. త్రివిక్రం





# స్వర్గం - నరకం

ఒకానొక ముని ఒక శిథిలాలయం ముందున్న మంటపంలో కూర్చుని ధ్యాన నిమగ్నుడై ఉండగా, అక్కడికి వచ్చిన ఒక సైనిక యోధుడు గుర్రందిగి ఆయన ఎదుట నిల బడ్డాడు. కొంత సేపటికి ముని కళ్ళు తెరవగానే యోధుడు ఆయనకు వినయంగా నమస్కరించి, ''కొన్నాళ్ళుగా నాకో సందేహం ఉన్నది,'' అన్నాడు.

''ఏమిటి? అడుగు,'' అన్నట్టు మందహాసం చేశాడు ముని.

''మనవాళ్ళు చెప్పుకునే స్వర్గం, నరకం నిజంగానే ఉన్నాయా? ఉంటే అవి ఎక్కడ ఉన్నాయి?'' అని అడిగాడు యోధుడు.

"నువ్వెవరివి? ఏం చేస్తూంటావు నాయనా?" అని అడిగాడు ముని.

''నేనీ దేశానికి సేనాధిపతిని!'' అన్నాడు యోధుడు గర్వంగా.

''నీలాంటి మూర్ఖుణ్ణి సేనాధిపతిని చేసిందెవరు?'' అన్నాడు ముని.

ఆ మాటకు భగ్గుమన్న సేనాధిపతి, పట్టరాని ఆవేశంతో కత్తి దూశాడు. ''ఇప్పుడే నీలో నరక ద్వారాలు తెరుచుకుంటున్నాయి,'' అన్నాడు ముని మందహాసంతో.

ఆ మాటతో సేనాధిపతి ఒక్క క్షణం వెనక్కు తగ్గి, కత్తిని ఒరలో వేసి, ''క్షమించండి, ముని వర్యా!'' అన్నాడు చేతులు జోడిస్తూ. ''ఇదిగో ఇప్పుడే నీలో స్వర్గ ద్వారాలు తెరుచుకుంటున్నాయి. మనలో చెలరేగే క్రోధం, లోభం, మోహం మొదలైన దుర్గుణాలే నరకకూపాలు. మనకూ, సాటివారికీ సుఖసంతోషాలు సమకూర్చే శాంతి, కరుణ, దయ, ఓర్పు మొదలైన సద్గుణాలు వెల్లివిరిసే మనసే స్వర్గం. స్వర్గ నరకాలు మరెక్కడో లేవు. మన మనసుల్లోనే ఉన్నాయి!'' అన్నాడు ముని ప్రశాంత వదనంతో.

''తెలిసింది, మునివర్యా! కృతజ్ఞతలు!'' అంటూ మునికి మరొక్కసారి నమస్కరించి అక్కణ్ణించి సంతోషంగా బయలుదేరాడు సేనాధిపతి. – (జెన్ కథ ఆధారంగా)





# పచ్చిమోసం



బలుసుపాడులో బాపనయ్య అనే వర్తకుడు న్నాడు. ఆ ఊళ్ళోనే రామయ్య అనే ఆసామీ ఉంటున్నాడు. రామయ్యకు కుటుంబ అవసరాలకు ఒక పాతిక రూపాయలు కావలసి వచ్చింది.

ఎవరినైనా అడుగుదామంటే తనను నమ్మి ఊళ్ళోవాళ్ళెవరూ దమ్మిడీ కూడా ఇవ్వరని తెలుసు. రామయ్య ఎప్పుడూ బాపనయ్యను అడిగి వుండలేదు. అందుచేత వడ్డీ ఆశ చూపి మెల్లగా బాపనయ్య దగ్గర డబ్బులాగాలనుకున్నాడు.

''బాపనయ్య బాబూ! ప్రాణం మీదికి వచ్చింది. మళ్ళీ ఈ వారం నాటికి పువ్వుల్లో పెట్టి నీవు కోరిన వడ్డీతో నీ చేతుల్లో పెడతా. ఒక్క పాతిక రూపాయలు ఇద్దూ!'' అని ప్రాధేయపూర్వకంగా అడిగాడు రామయ్య.

బాపనయ్య సామాన్యంగా చేయి జారే మనిషి కాదు. ఇంకెవరికన్నా ఐతే ఇచ్చేవాడేమో గాని, రామయ్యకు ఇస్తే వడ్డీ మాట అలా వుంచి అసలు గల్లంతు అవుతుందని బాపనయ్యకు అపనమ్మకం. అందువల్ల నాలుగు తియ్యటి మాటలు చెప్పి రామయ్యను సాగనంపుదామనుకున్నాడు.

''రామయ్యా! ఎన్నడూ అడగనివాడివి నోరు తెరిచి అడిగావు. ఏం చేసేది? సొమ్మంతా వ్యాపారంలో బిగిసి పోయింది. లేకపోతే, నీకిస్తే ఎక్కడికి పోతుంది. లేక లేక అడిగితే లేదన్నానని మరేమీ అనుకోకేం!'' అని అతి వినయంగా చెప్పాడు బాపనయ్య.

బాపనయ్య ఎంత వినయంగా చెప్పినా తనకు ఇవ్వడానికి ఇష్టం లేకనే ఇలా నాటకం ఆడాడని గ్రహించాడు రామయ్య. ''సరే! ఇంకొక చోట చూస్తాలే,'' అని వెళ్ళిపోయాడు.

కాని బాపనయ్య దగ్గర నుంచి ఏ విధంగానైనా డబ్బు రాబట్టాలని రామయ్య నిశ్చయించుకున్నాడు. కూర్చున్నా, నుంచున్నా, దీనిని గురించే ఆలోచించడం ఆరంభిం

చాడు. ఆఖరికి అతనికి ఏదో ఆలోచన వచ్చినట్లు చరచరా బాపనయ్య కొట్టు దగ్గ రకు వెళ్ళాడు.

కొట్లో బాపనయ్య ఒక్కడే కూర్చుని ఉన్నాడు. ఇదే సమయమని రామయ్య బాపనయ్యను సమీపించి, ''ఇదుగో, బాప నయ్యా! ఐదు పదులెంత ?'' అని ప్రశ్నిం చాడు.

రామయ్య లెక్క తెలియక అడుగు తున్నాడనుకొని ''యాభై కదటయ్యా!'' అన్నాడు బాపనయ్య. ''బాగుంది నీ తెలివి! అరవై కదూ?'' అన్నాడు రామయ్య తీవ్రంగా. ''భలేవాడివిలే యాభై'' అన్నాడు బాప నయ్య.

''ఏయ్! జాగ్రత్తగా మాట్లాడు. అరవై!'' అన్నాడు పెద్దగా కేకలు పెడుతూ రామయ్య. యాభై! అన్నాడు బాపనయ్య అంతకంటే పెద్దగా. ఇలా ఇద్దరి మధ్యా మాటామాటా పెరిగింది.

ఈ విధంగా బాపనయ్యా, రామయ్యా యాభై, అరవై అని కేకలు పెట్టుకోవడం విని చుట్టుపక్కల వాళ్లంతా బాపనయ్య కొట్టు దగ్గిరకు వచ్చి, ''ఏమిటయ్యా, మీ అరు పులు?'' అని ప్రశ్నించారు.

''చూడండి! ఈ పెద్దమనిషి, నన్ను మోసం చేయడానికి చూస్తున్నాడు. అవ సరానికి పనికొస్తాయిలెమ్మని నేను ఇతని దగ్గర అరవై రూపాయలు దాచుకున్నాను. తీరా అవసరమొచ్చి ఇప్పుడు అడిగితే, యాభయ్యే నంటున్నాడు,'' అన్నాడు రామయ్య నిజంగా సొమ్ము పోయినవా డిలా.

బాపనయ్య దిగ్భ్రాంతి చెందాడు. తాను పప్పులో కాలేసినట్లు అర్థమైంది. ''ఆరి



పిడుగా! నా దగ్గర నువ్వు డబ్బు దాచావా? ఎంత అన్యాయం! ఎంత అన్యాయం! అంతా ఒట్టిదే బాబూ!'' అని జరిగిన విషయం పెద్ద మనుషులకు చెప్పబోయాడు బాపనయ్య. రామయ్య అతడి మాటను చొరనివ్వలేదు. ''ఇదుగో, బాపనయ్యా! నీ నాటకం ఇక కట్టిపెట్టు.

ఇందాకటినుంచీ యాభై అని ఇప్పుడు అసలే లేదంటున్నావా? ఆ పది రూపాయలు తింటే తిన్నావు గాని నువ్వన్న ఆ యాభై రూపాయలు నా మొహాన పారెయ్! జన్మలో ఇంకెవరి దగ్గరా డబ్బు దాచిపెట్టకుండా బుద్ధి చెప్పావు.

ఈ పది రూపాయలతోనే బాగుపడిపోవులే. కానియ్!'' అన్నాడు రామయ్య ఎంతో చాకచక్యంగా.

అక్కడ చేరిన వాళ్లందరూ రామయ్య మాటలు నమ్మేశారు. కిరాణాకొట్టులో జరిగే చిల్లర మోసాలబారిన పడిన అనుభవం వారందరికీ ఎరుకే. వాళ్లు నిజంగా రామయ్య బాపనయ్య దగ్గర డబ్బు దాచాడనుకున్నారు. ''బాపనయ్యా! వాడు అరవై రూపాయలు దాచుకుంటే యాభయ్యేనంటివి. నువ్వు అన్నప్రకారం ఆ యాభయ్యే ఇవ్వమంటున్నాడు గదా? మొత్తం కైంకర్యం చెయ్యాలంటే ఎట్లా చెప్పు! దేనికైనా న్యాయం ఉండొద్దూ! మర్యాదగా యాభై రూపాయలు ఇచ్చి పంపెయ్!'' అని తీర్పు చెప్పారు అక్కడ చేరిన వాళ్లంతా.

బాపనయ్య చెమటలు గక్కాడు. ఇంకా స్సేపు ఆగితే అరవై రూపాయలు ఇవ్వమని తీర్పు చెప్తారేమోనని భయం పట్టుకుంది. పాపం బాపనయ్య కిక్కురు మనకుండా యాభై రూపాయలు రామయ్య దోసిట్లో పోశాడు.

చూశావా! నా తెలివి అన్నట్లు చూస్తూ రామయ్య చక్కాపోయాడు. చిల్లర వ్యాపారంలో ఊరివారందరికీ మస్కా కొడుతూ వచ్చిన బాపనయ్య మాట విడుపులో తేడా వల్ల ఊరివారి ముందు దోషిగా తలవంచవలసి వచ్చింది.

పాతిక రూపాయలు అప్పు ఇవ్వనందుకు బూటకం చేసి రెట్టింపు తీసుకు పోయాడని బావురుమన్నాడు పాపం, బాపనయ్య!





# 25 ఏళ్ళనాటి చందమామ కథ

## యజమానీ - నౌకరూ

పుంగవరం గ్రామంలోని పెద్ద ఆస్తిపరుల్లో, చైతన్య ఒకడు. అతడికి ఈ మధ్యనే వివాహం అయింది. భార్య భానుమతి సంపన్నుల ఇంటిబిడ్డ. ఆమె పుట్టినరోజు పండగ రేప నగా, ఈనాడు అతను పట్నం వచ్చి, భార్యకు బహుమతిగా ఇచ్చేందుకు పదివేల రూపా యలు పెట్టి, ఒక హారం కొన్నాడు.

అతడు సొంత గుర్రబ్బండిలో తిరుగు ప్రయాణమయ్యేసరికి సాయంకాలమ యింది. చీకటి పడకముందే గ్రామం చేరడం క్షేమం అనుకున్న చైతన్య, బండి తోలే పోల య్యతో, ''కాస్తవేగంగా బండి తోలు!'' అని చెప్పాడు. పోలయ్య తల ఊపి, గుర్రాన్ని గట్టిగా అదిలించాడు. బండి వేగంగా పోతు న్నది. చైతన్యకు చిన్న కునుకు పట్టింది. కొంత సేపటికి బండి ఆగడంతో అతడు కళ్ళు తెరిచి, ''ఆపావెందుకు? ఏం జరిగింది?'' అని పోలయ్యను అడిగాడు. పోలయ్య దారిపక్కన ఉన్న ఒక మనిషిని చైతన్యకు చూపుతూ, ''ఇతను నా పెళ్ళాం బాబాయి కొడుకు కాశయ్య, బాబూ! మన గ్రామమే వస్తు న్నాడు. తాత చావుబతుకుల మీద ఉన్నాడట. తొందరగా వెళితే, ఆఖరి చూపులయినా దక్కుతవని ఆశపడుతున్నాడు,'' అన్నాడు.

''అంటే బండి ఎక్కుతానంటాడు! సరే, వచ్చి కూర్చోమను,'' అన్నాడు చైతన్య విసుగ్గా. పోలయ్య బంధువు చైతన్యకు దణ్ణం పెట్టి బండి ఎక్కి కూర్చున్నాడు.

బండి తిరిగి బయలుదేరింది. పోలయ్య గుర్రాన్ని గట్టిగా అదిలిస్తున్నాడు. అసలే అది గతుకుల దారి. ఒకచోట మలుపుదారి తిరుగుతున్న సమయంలో బండి చక్రం ఒకటి గోతిలో దిగటంతో, బండి చప్పున పక్కకు ఒరిగి పోయింది. పోలయ్య కిందికి





''దారిలో బండి బోల్తాపడ్డంతపని జరిగింది.'' అన్నాడు చైతన్య. ''ఆ సంగతి తరవాత వింటాలెండి. ముందు తెచ్చిన బహుమతేదో చూపండి,'' అంటూ భానుమతి, భర్త చేతిలోని సంచీ తీసుకుని, లోపల వున్న చిన్న పెట్టెను బయటకు తీసింది.

ఆమె పెట్టెమూత తెరుస్తూ, ''నా స్నేహితురాలొకావిడ, ఉదయమే గ్రామం వచ్చింది. మీరేం నాసిరకం బహుమతి తేలేదు కదా!'' అని పెట్టెలోకి చూసి తరవాత ఆశ్చర్యంగా భర్తకేసి చూసింది. భార్య ఆశ్చర్యానికి కారణం ఏమిటో తెలియక చైతన్య, తనూ పెట్టెలోకి చూశాడు. అందులో హారం లేదు. అతడు నిర్ఘాంత పోయాడు. భానుమతి, చైతన్య కేసి రుసరుసలాడుతూ చూసి, ''ఇదా నా పుట్టిన రోజు బహుమానం!'' అంటూ పెట్టెను నేలకు వేసి కొట్టి గదిలోకి వెళ్ళిపోయింది.

భార్య మూర్ఖత్వానికి చైతన్యకు కోపం వచ్చింది. గట్టిగా చీవాట్లు పెట్టబోయిన వాడల్లా తమాయించుకున్నాడు. ముందు హారం సంగతి తేల్చాలి! ఈ దొంగతనం తప్పకుండా కాశయ్యదే అయివుంటుంది.

చైతన్య ఇలా ఆలోచిస్తూ, గొడ్లచావడి దగ్గిరకు వచ్చేసరికి, అక్కడ పోలయ్య గుర్రానికి గుగ్గిళ్లు పెట్టి, ఇంటికి వెళ్లే ప్రయత్నంలో ఉన్నాడు. చైతన్య అతడిని ఆగమని, ''భార్య వైపు బంధువంటూ ఒక దొంగ వెధవను బండి ఎక్కించావు. వాడు బండీలోంచి సామాను కింద పడినప్పుడు, పదివేలు ఖరీదు చేసే హారం కాజేసి, ఖాళీ పెట్టెను నా చేతి సంచీలో పెట్టాడు. వెంటనేపోయి

దూకేశాడు. చైతన్యా, కాశయ్యా కిందపడ్డారు. వాళ్ళ మీద చైతన్య కొని తెస్తున్న పళ్ళ బుట్టలూ, ఇతర సామానులూ వచ్చిపడినై.

కాశయ్య ముందుగా లేచాడు. పోలయ్యా, అతనూ చైతన్యను లేవదీశారు. చైతన్యకు కుడికాలు కొంచెం బెణికింది. కాశయ్యా, పోలయ్యా బలంగా పట్టి బండి చక్రాన్ని గోతిలోంచి బయటకు లాగారు. తరవాత కాశయ్య కిందపడిన సామానంతా తిరిగి బండిలో సర్దాడు. బండి బయలు దేరింది. గ్రామం చేరుతూనే కాశయ్య బండి దిగిపోయాడు.

చైతన్య ఇంటిముందు బండి దిగి, బెణికిన కాలు పట్టి పట్టివేస్తూ, నడవాలోకి వెళ్ళేసరికి భార్య, ''నా పుట్టిన రోజు బహుమతి ఎక్కడ?'' అని అడిగింది. ఆ ప్రశ్న వింటూనే చైతన్య మనసు చివుక్కుమన్నది. ఆమె తన కాలు కుంటడం గమనించినట్టే లేదు.

వాడినుంచి హారం లాక్కురా. హారం లేకుండా పనిలోకి రాకు,'' అన్నాడు కోపంగా.

పదివేల హారం పోయిందనగానే పోల య్యకు నెత్తిన పిడుగుపడినట్లయింది. అతడు యజమానికి ఏం జవాబు చెప్పాలో తోచక తల వంచుకున్నాడు. తరవాత చైతన్య అక్కడి నుంచి కదలగానే, పరుగు పరుగున గుడిసె చేరాడు.

పోలయ్య భార్య భర్తకోసం ఎదురు చూస్తూ, గుడిసెముందు నిలబడి ఉన్నది. పోలయ్య ఆమెను సమీపిస్తూ, ''నీ పుట్టింటి బంధువులంతా పేరు మోసిన దొంగ పీను గులు. మీ అన్న కాశయ్య, అయ్యగారి చేతి సంచీలోంచి వేలు చేసే హారం కాజేశాడు. మీ తాత చావుబతుకుల్లో ఉన్నాడంటే, బండి ఎక్కనిచ్చాను. పోయి హారం పట్టు కురా,'' అన్నాడు పళ్ళుకొరుకుతూ.

తన తాత చావుబతుకుల్లో ఉన్నాడన్న మాట వింటూనే, పోలయ్య భార్య కాశయ్య హారం దొంగిలించాడన్న మాటలు మరిచి పోయి, ''తాతకు అంత జబ్బు చేసిందా? నాకు మాటమాత్రంగా అయినా ఎవరూ కబురు చెయ్యలేదే! అంటూ తాత ఇంటి కేసి పరిగెత్తింది.

చైతన్య గొడ్ల చావడి దగ్గిర్నుంచి చిన్నగా కుంటుతూ, వీధివాకిలిని సమీపించేసరికి, తన భార్య ఈడుదే అయిన ఒకామె గడప దిగి వీధిలోకి పోతున్నది. చైతన్య ఆగి ఎవరా ఈమె అని చూసేంతలో భానుమతి వచ్చి, అతడి చెయ్యిపట్టుకుని, ''మీ కాలు నొప్పి ఎలా ఉంది? మీరేం బహుమతి తెచ్చారో



చూద్దాం అని వచ్చిన స్నేహితురాలు, నా కళ్ళు తెరిపించింది. ఇన్నాళ్ళూ, నేనెంత మూర్ఖురాలిగా ప్రవర్తించాను,'' అన్నది.

ఆ మాటలు విన్న చైతన్యకు కలిగిన సంతోషం అంతా ఇంతా కాదు. క్షణంలో అతడి కాలు నొప్పి, పదివేల హారం పోయిందన్న బాధ మటుమాయమైపోయాయి. అతడు భార్య చేతి ఆసరాతో ఇంట్లోకి వెళ్ళాడు.

ఆ మర్నాటి ఉదయం చైతన్య పోలయ్య కోసం ఎదురు చూస్తూ, వీధి అరుగుమీద కూర్చుని ఉండగా, పట్నంలో అతను హారం కొన్న నగల దుకాణం యజమాని వచ్చి, ''క్షమించండి, నిన్న మా దుకాణం పని వాడు హారం ఉన్న పెట్టె కాక, అలాంటిదే హారం లేని పెట్టెను మీకిచ్చాడు. రాత్రి దుకాణం మూస్తుండగా జరిగిన పొరపాటు తెలిసింది.'' అంటూ హారాన్ని అతడి చేతికి చ్చాడు.

చైతన్య దుకాణం యజమాని నిజా యితీని మెచ్చుకుని, భోజనానికి ఉండమ న్నాడు. కాని అతను దుకాణంలో తను లేక పోతే పనులు జరగవంటూ వెళ్ళిపోయాడు. చైతన్య పోలయ్య కోసం మరి కొంచె సేపు చూసి, హారాన్ని భార్య కిద్దామని బయలుదేర పోతుండగా, పోలయ్య అక్కడికి వచ్చాడు. అతను ఏదో చెప్పబోతుండగా, చైతన్య వారించి, హారాన్ని చూపుతూ, ''ఒరే, పోలయ్యా, నిన్న ఈ హారం పోయిందని భ్రమించడం మంచికే దారితీసింది. మీ అమ్మగారిలో ఎంత మార్పు వచ్చిందనుకున్నావు! హారాన్ని దుకా ణంలోనే వదిలి వచ్చాం. దాని యజమాని ఇంతకు ముందే తెచ్చి ఇచ్చాడు'' అన్నాడు.

పోలయ్య రెండు చేతులూ ఎత్తి చైత న్యకు నమస్కరించి, ''అయ్యా, హారాన్ని కాశయ్య దొంగిలించాడని పొరపడటం, నాకూ మేలే చేసింది!'' అన్నాడు. ఏమిటా మేలు?'' అన్నాడు చైతన్య ఆశ్చర్యపోతూ.

''గుడిసెకు వెళుతూనే, సంగతి చెప్పినా పెళ్లాన్ని వాళ్ళ తాత ఇంటికి పంపాను. చావనున్న తాత, ఏమైనా డబ్బు దాచి వుంటే తనకిస్తాడని కాశయ్య వచ్చాడట. ముస లాడు అలాంటిదేమీ లేదనేసరికి, నాలుగు తిట్టివెళ్ళిపోయాడట. నా పెళ్ళాం తెల్లవార్లూ ఒంటరిగా ముసలాడికి సేవ చేసింది. పోయే ముందు తను డబ్బుదాచిన చోటు, దానికి చెప్పాడట.'' అన్నాడు పోలయ్య.

''బావుంది పోలయ్యా! కాస్త ఘనంగానే ఉందా!'' ఇంతకూ, ఆ ముసలాడు వదిలి పోయిన డబ్బు ఎంత?'' అని అడిగాడు చైతన్య. ''అవునయ్యా! ఆ డబ్బుతో సొంతాన ఏదైనా వ్యాపారం చేసుకోబోతున్నాను,'' అన్నాడు పోలయ్య వినయంగా.

రాత్రి పోలయ్యను అనవసరంగా కోప్పడి నందుకు చైతన్యకు చాలా బాధకలిగింది. అతను పోలయ్యకేసి ఆప్యాయంగా చూస్తూ, ''మొత్తంమీద హారం మనిద్దరికీ చాలా మేలు చేసింది. నీ కాళ్ళమీద నువ్వు నిల బడుతున్నందుకు సంతోషంగా వుంది. నువ్వు చేయబోయే వ్యాపారంలో, నానుంచి ఏమైనా సాయం కావలసివస్తే, సంకోచించ కుండా వచ్చి అడుగు,'' అన్నాడు.

– మాచిరాజు కామేశ్వరరావు





# బృహస్పతి పరీక్ష



కళింగ దేశాన్ని పరిపాలించే చంద్రహాసుడి కొలువులో కోశాధికారి పదవి ఖాళీ అయింది. రాజు కొలువులో ఎంతో కీలకమైన ఆ పదవిని భర్తీ చేయడానికి అన్ని విధాలా యోగ్యుడైన యువకుని కోసం అన్వేషించసాగారు. దేశం నలుమూలల నుండి వచ్చిన యువకులంద రికీ ఈ సందర్భంగా పలు పోటీలు నిర్వహిం చారు.

పోటీల అనంతరం అన్ని విద్యల్లోనూ సందీపుడు, సంజయుడు అనే ఇద్దరు యువకులు సరిసమానులుగా నిలిచారు. దీంతో ఈ ఇద్దరిలో ఎవరిని కోశాధికారి పదవిలో నియమించాలన్నది సమస్యగా మారింది.

ఆ రాజ్యంలోనే కంచిపేట అనే గ్రామంలో బృహస్పతి అనే విజ్ఞుడు నివసించేవాడు. మంత్రి సలహామేరకు చంద్రహాసుడు ఓ లేఖ రాసి దానిని తీసుకెళ్లి బృహస్పతికి అందజే యవలసిందిగా యువకులిద్దరినీ ఆజ్ఞాపిం చాడు.

రాజాజ్ఞ ప్రకారం కంచిపేట చేరుకున్న యువకులిద్దరూ బృహస్పతిని కలుసుకుని రాజుగారి లేఖను అతడికి అందించారు. లేఖ ఆసాంతం చదివిన బృహస్పతి మందహా సంతో యువకులిద్దరినీ తన ఇంట్లోకి ఆహ్వా నించాడు.

ఆ పూట తన ఆతిథ్యాన్ని స్వీకరించవల సిందిగా వారిని కోరి విశ్రమించడానికి వారికో గదిని కేటాయించాడు.

భోజనాలు సిద్ధం చేయించి, కాళ్ళు, చేతులు కడుగుకునేందుకు ఇద్దరికీ నీళ్ళం దించాడు. దగ్గరుండి అన్నీ పర్యవేక్షించ సాగాడు. వాళ్ళు భోజనం చేస్తున్నంతసేపూ వారిని సునిశితంగా పరిశీలించసాగాడు. భోజనాలు ముగిశాక రాజుగారి ఉత్తరానికి ప్రత్యుత్తరం రాసి, వారి చేత బెట్టిసాగనంపాడు.

ఆ యువకులిద్దరూ మళ్లీ రాజాస్థానం చేరుకున్నారు. వారిద్వారా బృహస్పతి పంపిన ప్రత్యుత్తరం చదివిన చంద్రహాసుడు చిక్కు ముడి వీడినట్లు చిరునవ్వు చిందించి, సందీ

పుని కోశాధికారిగా నియమిస్తున్నట్లు ప్రకటించాడు.

సందీపుడిని తనకంటే మిన్నగా బృహస్పతి ఎన్నుకోవడంలో ఆంతర్యం సంజయుడికి బోధపడలేదు. దీంతో తన సందేహాన్ని రాజు ముందుంచాడు.

ప్రభూ! అన్ని విద్యల్లోనూ మేమిరువురమూ సమఉజ్జీలుగా నిలిచాము కదా, మాలో సందీపుడే మిన్న అని మీరు ఎలా నిర్ణయించారు.?

అప్పుడు బృహస్పతి పంపిన ప్రత్యుత్తరంలోని సారాంశాన్ని రాజు సభకు ఇలా తెలియపరిచాడు. ఈ ఇద్దరి ఆహారపుటలవాట్లను సునిశితంగా పరిశీలించే నిమిత్తం రకరకాల నోరూరించే వంటకాలను బృహస్పతి వీరి ముందు ఉంచాడు. సంజయుడు అన్నిరకాల వంటకాలతో తన విస్తరిని నింపుకున్నాడు. సందీపుడు మాత్రం తగినంత మోతాదులోనే వడ్డించుకుని సంతృప్తిగా భోంచేశాడు. సంజయుడు విస్తరిలో ఉన్న పదార్థాలను తినలేక వాటిని వృధాపరిచాడు. తమ తమ అలవాట్ల ద్వారా సందీపుడు పొదుపరి తనాన్ని, సంజయుడు విచ్చలవిడితనాన్ని ప్రదర్శించారు.

తర్వాత రాజు తన నిర్ణయం ప్రకటించాడు. కోశాధికారికి ఉండవలసిన అత్యంత ప్రధాన యోగ్యత నియంత్రణ. తన పొదుపరి తనంతో సందీపుడు ఈ యోగ్యత తనకు ఉన్నట్లుగా నిరూపించుకున్నాడు. కాబట్టి సందీపుడే ఈ పదవికి సరైన యోగ్యుడు.

బృహస్పతి వివరణను, రాజు నిర్ణయాన్ని విన్న సంజయుడు మారుమాట్లాడకుండా సందీపునికి అభినందనలు తెలియజేసి వెనుదిరిగాడు. – ఎం. మురళీమోహన్



# భారత దర్శిని

## దుస్తులను లాగించే మహిళ




కర్నాటక రాష్ట్రం తురువెకెరె సమీపంలో ఉండే అరలికెరె అనే ఓ చిన్న గ్రామంలో ప్రజలు తమ దుస్తులను ఆరుబయట ఆరవేయరట. ఎందుకో తెలుసుకుంటే ఆశ్చర్యం వేస్తుంది. ముప్పై అయిదేళ్ల మహిళ బంగారి వాటిని లాగించేస్తోందని అందరికీ భయం! ఆమె రోజూ కాస్త అన్నం తింటుంది. నూలు దుస్తులను మాత్రం ఆబగా తినేస్తుంది.

అయితే ఆమె తల్లి శివమ్మ రోజూ అరటి పళ్ళు తినిపిస్తుండటంతో బంగారికి అజీర్తి సమస్యలు రాలేదు. శివమ్మ చెబుతున్న దాని ప్రకారం, పసిపిల్లగా ఉన్నప్పటినుంచి బంగారికి దుస్తులు తినివేయడం అలవాటుగా మారిందట. ఆమె పెద్దదవుతున్న కొద్దీ దుస్తులను తినే అలవాటును వదులుకోవడం కష్టమైపోయింది. తమ ఇంట్లో దుస్తులు పూర్తిగా అయిపోతే ఎంచక్కా పొరుగిళ్లలో దూరి కనబడ్డ దుస్తులనల్లా లాగించేస్తుందట.

## అసహజ మరణాలను అడ్డుకునే లాంతరు

చత్తీస్‌గర్ లోని లెంధ్రా ప్రాంత ప్రజలు 17 ఏళ్లుగా దీపాన్ని అవిరామంగా వెలిగిస్తున్నారట. చత్తీస్‌గర్ లోని రాయ్‌గర్‌కు 5 0 కిలోమీటర్ల దూరంలో ఉండే రాధా మాధవ్ సంకీర్తన్ ఆశ్రమం పక్కన ఉండే గ్రామాలయం ముందు భాగంలో ఈ దీపాన్ని నెలకొల్పారు.

భూమిలో పాతిన ఈ దీపాన్ని ఆరకుండా చూసేందుకు ఇద్దరు వ్యక్తులను ప్రత్యేకంగా నియమించారు.

చుట్టుపక్కల గ్రామాలనుంచి అసంఖ్యాక ప్రజలు లెంధ్రాకు వచ్చి దీపానికి మొక్కులు చెల్లిస్తారు. ఇక్కడికి వచ్చే సందర్శకులందరికీ ఉచిత భోజనం అందించడానికి ఆలయ నిర్వాహకులు తగు ఏర్పాటు కూడా చేశారు మరి.





# మన దేశభాషలు నేర్చుకుందాం

ఈ జాబితాలో మొదట మీకు తెలిసిన భాషలలోని పదాలను చదవండి. ఆ తరవాత వాటి కింద ఇచ్చిన పదాలను అనుసరించి ఆయా భాషలలో ఆ పదాల ఉచ్చారణలనూ, అర్థాలనూ నేర్చుకోడానికి ప్రయత్నించండి.

    

| English | What | When | Where | Why | How |
|---|---|---|---|---|---|
| Telugu | ఏమి | ఎప్పుడు | ఎక్కడ | ఎందుకు | ఎలా |
| Hindi | क्या<br>క్యా | कब<br>కబ్ | कहाँ<br>కహా | क्यों<br>క్యోం | कैसे<br>కైసే |
| Tamil | என்ன<br>ఎన్నా | எப்போது<br>ఎప్పోదు | எங்கே<br>ఎంగే | ஏன்<br>ఏన్ | எப்படி<br>ఎప్పడి |
| Bengali | কি<br>కి | কখন<br>కొఖోన్ | কোথায়<br>కొథాయ | কেন<br>కెనో | কিভাবে<br>కివబె |
| Marathi | काय<br>కాయ్ | केव्हां<br>కెవాన్ | कोठे<br>కోథే | कशाला/कां<br>కాష్లా/కాన | कसे<br>కసే |
| Kannada | ಏನು<br>ఏను | ಯಾವಾಗ<br>యావాగ | ಎಲ್ಲಿ<br>ఎల్లి | ಯಾಕೆ<br>యాకే | ಹೇಗೆ<br>హేగె |
| Oriya | କଣ<br>కన్ | କେତେବେଳେ<br>కెటబెల | କେଉଁଠାରେ<br>క్యూంధారే | କାହିଁକି<br>కహింకి | କିପରି<br>కిపారీ |
| Gujarati | શું<br>షన్ | ક્યારે<br>క్యారే | કેમ/શા માટે<br>కెంషామాటే | ક્યાં<br>క్యాన్ | કેવી રીતે<br>కవే రీటే |
| Assamese | কি<br>కి | কেতিয়া<br>కిటియా | ক'ত<br>కోట్ | কিয়<br>కియో | কেনেকৈ<br>కెనెకోయ్ |
| Malayalam | എന്ത്<br>ఎన్తు | എപ്പോൾ<br>ఎప్పోల్ | എവിടെ<br>ఎవిడే | എന്തുകൊണ്ട്<br>ఎన్తుకొన్డు | എങ്ങനെ<br>ఎన్గనే |
| Santali | [illegible]<br>చెద్ | [illegible]<br>టిసోగ్ | [illegible]<br>ఒకారే | [illegible]<br>చెదాగ్ | [illegible]<br>చెద్ లెకారే |
| Sanskrit | किम्<br>కిమ్ | कदा<br>కదా | कुत्र<br>కుట్ర | किमर्थं<br>కిమర్థమ్ | केन प्रकारे<br>కెన్ ప్రకారమ్ |

కింది బ్రాకెట్లలో సూచించిన భాషను పరిశీలించండి. వాక్యాన్ని పూరించడానికి ఆ భాషలోంచి తగిన పదాన్ని రాయండి.

1. మీ పేరు ......... ?(తమిళ్)
2. బస్సు .......... వస్తుంది? (హిందీ)



    

| English | Here | There | Before | After | Because |
|---|---|---|---|---|---|
| Telugu | ఇక్కడ | అక్కడ | ముందు | తర్వాత | అందుచేత |
| Hindi | यहाँ<br>యహా | वहाँ<br>వహా | पूर्व<br>పూర్వ్ | पश्चात<br>పశ్చాత్ | क्योंकि<br>క్యోంకీ |
| Tamil | இங்கே<br>ఇంగే | அங்கே<br>అంగే | முன்<br>మున్ | பின்<br>పిన్ | ஏனெனில்<br>ఏనేనిల్ |
| Bengali | এখানে<br>ఎఖానే | সেখানে<br>షెఖానే | আগে<br>ఆగే | পরে<br>పొరే | কারণ<br>కరోన్ |
| Marathi | इथे<br>ఇథే | तिथे<br>తిథే | आधि<br>ఆధి | नंतर<br>నన్తర్ | कारण की<br>కారణ్ కీ |
| Kannada | ಇಲ್ಲಿ<br>ఇల్లి | ಅಲ್ಲಿ<br>అల్లి | ಮೊದಲು<br>మొదలు | ನಂತರ<br>నంతర | ಯಾಕೆಂದರೆ<br>యాకెందరె |
| Oriya | ଏଠାରେ<br>ఎథారే | ସେଠାରେ<br>సెథారే | ପୂର୍ବରୁ<br>పురిబరు | ପରେ<br>పోరే | କାରଣ<br>కారణ్ |
| Gujarati | અહીં<br>అహీన్ | ત્યાં<br>థ్యాన్ | પહેલા<br>పెహెలా | પછી<br>పచ్చే | કારણ કે<br>కారణ్ కే |
| Assamese | ইয়াত<br>ఇయత్ | তাত<br>టట్ | আগতে<br>అగోటె | পিছত<br>పిసోట్ | কাৰণ<br>కరోన్ |
| Malayalam | ഇവിടെ<br>ఇవిడె | അവിടെ<br>అవిడె | മുമ്പ്<br>ముంపు | ശേഷം<br>షెషన్ | കാരണം<br>కారణమ్ |
| Santali | ᱱᱚᱸᱰᱮ<br>నోండె | ᱦᱚᱸᱰᱮ<br>హొండే | ᱢᱚᱰᱟᱝ<br>మడంగ్ | ᱴᱚᱭᱚᱢ<br>టయోమ్ | ᱠᱷᱟᱛᱤᱨ<br>ఖటిర్ |
| Sanskrit | अत्र<br>అత్ర | तत्र<br>తత్ర | पूर्वं<br>పూర్వమ్ | पश्चात्<br>పశ్చాత్ | यतः<br>యథః |

3. బంతి ........... ఉంది (అస్సామీస్)
4. మీరు ........... అక్కడ భోంచేయలేదా? (సంథాలి)
5. పార్టీ ........... ఉంది? (మలయాళం)
6. షాప్ ........... ఉంది (సంస్కృతం)
7. నా స్కూలు ............. మీది కొండపై ఉంది. (మరాటీ)
8. మా అమ్మమ్మ మేల్కొల్పుతుంది. నేను............ వెళ్ళాలి. (గుజరాతీ)
9. భోజన ............. మాకు ఇంగ్లీష్ తరగతి ఉంది (కన్నడ)
10. ఆపిల్ గురుత్వాకర్షణ శక్తి ........... నేలమీద పడుతుంది. (బెంగాలీ)





# మన చరిత్ర పుటల నుంచి

## రాజ్యశ్రీ

క్రీస్తు శకం 606, మే 14. వింధ్య పర్వతాల దిగువన.

పలాయనం

తారకమంత్రం. దీనికి మించినది మరొకటి లేదు.

ఆమె ఓ చెట్టు బోదెకు ఆనుకుని నిట్టూర్పు విడుస్తోంది. ఆమె దుస్తులు చిరిగిపోయి ఉన్నాయి; ఒకప్పుడు పట్టువస్త్రాలతో మెరిసిన ఆమె ఒంటిపై నాసిరకం గోధుమ వర్ణపు దుస్తులు జీరాడుతున్నాయి. ఒకప్పుడు ఆమె రత్నాభరణాలతో మెరిసిపోయేది.



అద్భుత నైపుణ్యంతో రూపొందించిన హారాలు, కంకణాలను ధరించిన ఒకప్పటి తన రూపం గురించి తల్చుకుని ఇప్పుడామె మనస్సు వేగిపోతోంది.

గతంలో తాను తిన్న ఖరీదైన ఆహారపదార్థాలు ఇప్పుడామెకు గుర్తుకూడా రావడం లేదు.

వాస్తవం చెప్పాలంటే ఆమె కులీన జీవితం గడిపేది. అంతవరకు ఆమెకు గుర్తు ఉంది. గత వైభవం గురించిన ఆలోచనలు వేధిస్తుంటే ఆవేదనతో ఆమె మనస్సు వేగిపోతోంది.

పరిపరివిధాలుగా ఆమె ఆలోచిస్తోంది. లేదు... లేదు... లేదు.... ఇది ఇంకా కొనసాగకూడదు.

***

రాజమందిరం, క్రీస్తు శకం 606 ఏప్రిల్ 30, కనోజ్ నగరం

''మనం తప్పక అతడికి ఆతిథ్యం ఇవ్వవలసిందేనా'' మెరుస్తున్న స్వర్ణ హారాన్ని మెడలో అలంకరించుకుంటూ ఆమె ఉల్లాసంగా అడిగింది.

ఆ ఉదయం వేళ దిగువున ఉన్న వీధుల్లోంచి జనం అరుపులు, కేకలు ప్రతిధ్వనిస్తున్నాయి; మాళవ నుంచి వచ్చిన అతిథులను నగరం సాదరంగా ఆహ్వానిస్తోంది. రాజమందిరం ప్రాకారాలు, తలుపుల చుట్టూ తోరణాలు వేలాడదీశారు;

''మాట్లాడుతున్నది నిజంగా కనోజ్ రాణియేనా?'' కనోజ్ రాజు గృహవర్మ తన ప్రియ

నెచ్చెలిని పొదివిపట్టి దగ్గరకు లాక్కున్నాడు. ''దేవగుప్తుడు మాళవ రాజు మాత్రమే కాదు. అతడు మన మిత్రుడు, సహచరుడు కూడా. అతడు ఈ స్వాగతానికి ఎంతో అర్హుడు.''

బల్లపైన ఉన్న పట్టు వస్త్రం నుంచి ఆమె కిరీటాన్ని అందుకుంది; అది మరకత, మాణిక్యాలతో తాపడం చేసిన స్వర్ణ కిరీటం. అయితే కనోజ్ రాజులు తమ స్వంత వైభోగం కంటే ప్రజల సౌభాగ్యంపైనే మక్కువ చూపేవారు. ఆమె ఆ కిరీటాన్ని మృదువుగా అతడి తలపై అలంకరించింది.

''నేనిప్పుడు రాజును,'' అన్నాడతడు.

''మీ రాజరికాన్ని నిరూపించుకోవడం కోసం మీకు కిరీటం అవసరం లేదు,''

''నీ సౌందర్యాన్ని నిరూపించుకోవడానికి నీకూ రత్నాభరణాలు అవసరం లేదనుకో... అయినా, దీనిని నీకు బహూకరించకుండా ఉండలేను.'' అతడు పట్టువస్త్రం నుంచి మేలిమి బంగారు హారాన్ని తీశాడు. మరకత, మాణిక్య, వజ్రవైఢూర్యాలతో రాబందు రూపంలో అలరారిన అద్భుత హారమది.

''పక్షిరాజు కనోజ్ రాణికి అభివందనం చేస్తున్నాడహో'' గృహవర్మ గుసగుసలాడుతూ ఆమె మెడలో సుతిమెత్తగా హారాన్ని ధరింపజేశాడు. ఆమె మెరుస్తున్న కళ్లతో మందహాసం చేసింది.

ఎవరో సన్నగా దగ్గడంతో వారు సావధానులయ్యారు. రాజు భటుడు తలుపు వద్ద నిలబడి ఇలా అన్నాడు. ''ప్రభూ, మాళవరాజు మీ దర్శనార్థం మందిరంలో వేచి ఉన్నాడు''

''మంచిది, మనం అలాంటి లాంఛనాలు పాటించనవసరం లేదు.'' గృహవర్మ సుతిమెత్తగా చెప్పాడు. ''అతడిని సగౌరవంగా



రాజమందిరంలో కూర్చుండబెట్టండి. నేనూ, రాణీ తనను అక్కడే కలుస్తాము.''

ఆమె అందుకుంది. ''తనను మన మంది రాల్లోకి నేరుగా తీసుకురానవసరం లేదనుకుంటాను..''

''రా ప్రియతమా, దేవవర్మ మనకు చాలా కాలంగా తెలుసు, ఎక్కడైనా అతడిని మనం కలవవచ్చు.''

క్షణాల్లో, రాజభటుడు మాళవరాజును తోడ్కొని వచ్చాడు. ఆమె తన భర్తను చూస్తూ మైమరపులో ఉండకపోతే, మాళవరాజు యుద్ధవీరుడి దుస్తులలో ఉన్నాడని గుర్తించేది. అతడి దుస్తులు అంత కళావంతంగా లేవు కాని అతడి నవ్వు మాత్రం ఉత్సుకతతో ఉన్నట్లుంది.

''దేవా!'' గృహవర్మ సాదరంగా ఆహ్వానిస్తూ ముందుకొచ్చాడు.



చింది. ఆకులురాలిన నేలమీద నడిచివచ్చిన ఆమె కాళ్లనుంచి రక్తం కారింది. తాను నేలమీద పాదాలు మోపి నడిచిన అరుదైన క్షణాలను ఆమె లీలగా గుర్తు చేసుకుంది. ఆమె తల్లి తండ్రులు, సోదరులు, భర్త ఆమెను ఎల్లప్పుడూ పల్లకిలోనే ప్రయాణించమని చెప్పేవారు.

ఆనాడు జరిగిన దాడి తరవాత ఆమె జీవితం శూన్యమైపోయింది. ఆరోజు తాను పెట్టిన గావుకేకలు, జీవంలేని భర్త చూపులు. అటూ ఇటూ పరుగెడుతున్న రాజభటులు.. అంతా శూన్యం.

మాళవ బలగాలు కదం తొక్కుతున్నాయి. ''మనం ముట్టడికి గురయ్యాం'' కేకలు.

''దేవగుప్తా.. ద్రోహీ'' అది మంత్రి స్వరం.. వారి మందిరాలకు ఎవరు ప్రవేశించారో ఆ దేవుడికే ఎరుక.

జీవితంలోకెల్లా తీరని విషాద క్షణాలను ఆమె భరిస్తున్న క్షణాలవి.

''మూర్ఖుల్లారా! ఆమెను వెళ్లనివ్వండి!''

స్పృహ కోల్పోతున్న క్షణాల్లో, ద్వేషంతో కూడిన వికటాట్టహాసాన్ని ఆమె విన్నది.

కొన్ని ఘడియల తర్వాత ఆమెకు మెలకువ వచ్చింది.

ఆమె చిమ్మచీకటి అలుముకుని ఉన్న భూగర్భ కారాగారంలో పడి ఉంది. తన వివాహం జరిగిన తొలి సంవత్సరంలో ఈ కారాగారాన్ని ఆమె ఓసారి చూసింది. ఖైదీల గావుకేకలతో కూడిన ఆ భయానక దృశ్యాన్ని ఆమె ఎన్నటికీ మర్చిపోలేదు. ఇప్పుడామె ఇక్కడే మరణిస్తుంది కూడా.

అయితే ఆమె చావలేదు. విశ్వాసపాత్రులైన కనోజ్ రాజభటులు ఆమెను కారాగారం నుంచి

''ఎట్టకేలకు మౌఖారీ వారసులు కలుసుకుంటున్నారు..'' దేవగుప్తుడు పెద్దగా నవ్వాడు.

''అవును.. లాంఛనప్రాయ గౌరవం కదూ!'' ఆ ఇద్దరూ ఆప్యాయంగా కౌగలించుకున్నారు.

ఆమె మనస్సులో ప్రమాద ఘంటికలు మోగాయి.

''అయ్యో నాథా!'' ఆమె గావుకేక వేసింది.

ఏక కాలంలో పలు ఘటనలు జరిగిపోయాయి. రాజభటుడు ఒక్కసారిగా ముందుకు వచ్చాడు. గృహవర్మ అప్రసన్నంగా చూశాడు. దేవగుప్తుడు గృహవర్మ వెనుకవైపు చేయి సాచాడు. చేతిలో సన్నటి ఛురికతో గృహవర్మను వెన్నుపోటు పొడిచాడు.

ఆమె ఒక్కసారిగా గావుకేక వేసింది.

* * *

క్రీస్తుశకం 606 మే 14. వింధ్య పర్వతాల దిగువన.

మహారణ్యం ఆమె కేకలతో ప్రతిధ్వనిం

తప్పించారు. మోయగలిగనన్ని దుస్తులు, నగదు ఇచ్చి ఆమెను అడవిలో వదిలిపెట్టారు.

అప్పటినుంచి ఆమె పరుగెడుతూనే ఉంది. తానెక్కడుందో ఆమెకు తెలియదు. వింధ్య పర్వత సానువులలో వున్నట్లు మాత్రమే ఆమెకు తెలుసు.

భయానకమైన దృశ్యాలు ఆమెను వెంటా డుతున్నప్పటికీ, గుడ్డిగా ఆమె ముందుకు సాగుతోంది. గృహవర్మ మృతి చెందాడు. రాజ మందిరంలో కల్లోలం. కారాగారంలో దుర్భ రమైన జీవితం, కనోజ్ మనగలిగిందా? ఇప్పుడు దాని పరిస్థితి ఏమిటి?

తన జన్మస్థానం థానేశ్వర్ పరిస్థితి ఏమిటి? కనోజ్ మీదే గురిపెట్టినవారు తన సోదరులపై గురి పెడతారనడంలో సందేహం దేనికి? ఆమె తండ్రి కొద్ది నెలల క్రితమే పోయాడు. ఆమె సోదరులు చిన్నవారు. చిన్నారులు కాబట్టే దేవగుప్తుడు వారిని కూడా ఇప్పటికే హత్య చేసి ఉంటాడు.

ఆమె తిండి తిని రెండు రోజుల యింది. నీటి చుక్క ఎక్కడుంటుందో కూడా ఆమెకు తెలీటం లేదు.

ఆమె ఉన్నట్లుండి ఒక నిశ్చయానికి వచ్చింది. ఎండు కర్రలు, వెదురు బొంగుల కారణంగా అడవి అంటుకుంది.

ఎక్కడో పొదలు కదిలిన సవ్వడి. ఆమె దాన్ని నిర్లక్ష్యం చేసింది. ఆమె నిప్పు రాజేసింది. చుట్టుపక్కల ఉన్న కొమ్మ లను తెచ్చి పేర్చింది. ఇదే ఆమె అంత్య క్రియల స్థలం కావచ్చు. ఆమె మంట ల్లోకి ఉరకడానికి సిద్ధపడింది.

పెద్దగా పొదల్లో చప్పుడు. ఎవరో సమీపిస్తున్నారు. శత్రువుల కంటబడక ముందే ఆమె చనిపోతుందేమో.

''వద్దు!'' ఎవరో కేక పెట్టారు. ''వద్దు రాజ్యశ్రీ, దయచేసి ఆగు!''

ఆమె ఆగిపోయింది. స్తంభించిపోయింది. అది.. తన భర్త తర్వాత తాను ప్రపంచంలో అందరికంటే ప్రాణాధికంగా ప్రేమించే వారి గొంతేనా, కాదేమో.

అప్పుడు అతడు ఆమె ముందుకు వచ్చాడు. చెల్లాచెదురైన జుత్తుతో, చెదిరిన దుస్తులతో, రొప్పుతూ అతడు ముందుకొచ్చాడు. ''రాజ్యశ్రీ ఆగు.''

''హర్షా,'' నవ్వింది. హర్షాతిరేకంతో పులకిం చింది. ''నా సోదరుడా, నీవొచ్చావు.''

ఆమె ఇక సురక్షితురాలు.

''అవును'' థానేశ్వర రాజు హర్షవర్ధనుడు మందహాసం కురిపించాడు. ''నేనొచ్చాను.''

– పవిత్రా శ్రీనివాసన్



Avail the loyalty bonus!

**Chandamama Subscribers will get flat 10% off on subscription renewals! (All Editions)**



# Chandamama!

Because stories make the world go round...

**Choose** your Chandamama!
Go to www.chandamama.com & subscribe Now!!



**Chandamama is available in English and 12 regional languages.**
**Junior Chandamama for children below 9 years is available only in English.**

I want to subscribe to / gift / renew subscription for the following editions of Chandamama:

☐ English ☐ Telugu ☐ Tamil ☐ Kannada ☐ Hindi
☐ Marathi ☐ Gujarati ☐ Oriya ☐ Bengali ☐ Sanskrit
☐ Santali ☐ Malayalam ☐ Assamese ☐ Junior

Name: ..............................................................................................

Date of Birth: ................................ Sex :......................................

Address: ..........................................................................................

......................................................................................................

......................................................................................................

....................................................... City: ...........................................

State:....................................... Pin:..................................................

Telephone:........................................................................................

Mobile:..............................................................................................

Email:...............................................................................................

Subscription Number (for renewals):..............................................

Gift Subscription to the following address:

......................................................................................................

......................................................................................................

......................................................................................................

......................................................................................................

Enclosed Cheque/DD* for Rupees...................................................

Cheque/DD No ..............................................................................

favouring Chandamama India Ltd on.............................................

......................................................................................bank.

Please mail the subscription form to:
**Chandamama India Limited,**
B-3, Lunic Industries, Cross Road 'B',MIDC, Andheri (East),
Mumbai-400093. Phone +91 22 28312872 / 28311849
Email: subscription@chandamama.com
You can also subscribe online at: www.chandamama.com

## Get surprise gifts by subscribing this month **

| Take Your Pick! | 1 YEAR | 2 YEARS | 3 YEARS | 4 YEARS | 5 YEARS |
|---|---|---|---|---|---|
| ENGLISH (Rs. 25/- per copy) | Rs. 300 | Rs. 540 | Rs. 765 | Rs. 960 | Rs. 1125 |
| **You Save** | | **Rs. 60** | **Rs. 135** | **Rs. 240** | **Rs. 375** |
| REGIONAL (Rs. 20/- per copy) | Rs. 240 | Rs. 430 | Rs. 610 | Rs. 770 | Rs. 900 |
| **You Save** | | **Rs. 50** | **Rs. 110** | **Rs. 190** | **Rs. 300** |
| JUNIOR (Rs. 15/- per copy) | Rs. 180 | Rs. 325 | Rs. 460 | Rs. 575 | Rs. 675 |
| **You Save** | | **Rs. 35** | **Rs. 80** | **Rs. 145** | **Rs. 225** |

** conditions apply

**Annual Subscription Overseas :** US $40 for English Chandamama, US $30 for Regional Languages, US $25 for Junior Chandamama (including shipping and handling charges) by air mail.

# శిథిలాలయం




*(చందమామ కథల మాంత్రికుడు దాసరి సుబ్రహ్మణ్యం గారు చందమామ స్వర్ణయుగంలో రాసిన శిథిలాలయం సీరియల్ తొలిసారిగా **1968** జనవరిలో మొదలై, **1970** సెప్టెంబరు వరకు కొనసాగింది. ఆయన రాసిన **12** ధారావాహికలను గత **50** ఏళ్లుగా పలుసార్లు చందమామలో పునర్ముద్రించడం జరిగింది. కాని, శిథిలాలయం ఇంతవరకు చందమామలో పునర్ముద్రణ కాలేదు. దాసరి గారి సంస్మరణార్థం శిథిలాలయం సీరియల్‌ను మరోసారి చందమామ పాఠకులకు అందించడానికి సంతోషిస్తున్నాము.)*

తూర్పు కనుమల్లోని పర్వతారణ్య ప్రాంతాల్లో శబరజాతి వాళ్లు నివసించే పల్లెలు అనేకం ఉండేవి. వాటిలో కుంభారమిట్ట అనే పల్లెకు శివాలుడు అనేవాడు నాయకుడు. అతడు అరవైఏళ్లు పైబడిన వృద్ధుడు.

అతడికి పద్దెనిమిదేళ్ల ఈడువాడైన శిఖిముఖి అనే కుమారుడున్నాడు. శిఖిముఖి అంటే తండ్రికి పంచప్రాణాలు. అందుక్కారణం అతడు శివాలుడికి నడివయసు దాటేంతర్వాత కలిగిన ఏకైక సంతానం కావటం.

తన తరవాత పల్లెకు నాయకత్వం వహించవలసిన వాడు శిఖిముఖి కావటం చేత శివాలుడు కొడుక్కు బాల్యప్రాయంలోనే తగిన గురువులను పెట్టి కర్ర కత్తిసాము, అరణ్యంలో నదుల్లో వేటాడి ఆహారం సంపాదించే విద్యలూ నేర్పించాడు.

వీటన్నిటిలో శిఖిముఖి తన పదిహేనవ ఏట నుంచే నిపుణుడనిపించుకున్నాడు. కుంభార మిట్టలోనే గాక, ఆ చుట్టు పక్కల వున్న మరే శబరపల్లెలో కూడా అతణ్ణి మించిన వేటకాడూ, ధైర్యశాలీ, ఉపాయ



శాలీ లేడు.

శిఖిముఖిని నలుగురూ మెచ్చుకునేప్పుడు శివాలుడు ఎంతో సంతోషపడేవాడు. కాని, అంత సంతోషంలోనూ అతడికి కొడుకును గురించి ఆవగింజంత విచారం కూడా ఉండేది. తనలాగే కొడుకును కూడా చదువడం, రాయడం నేర్చిన వాడినిగా చేయాలని శివాలుడు ఎంతో ప్రయత్నించాడు. కాని, అది ఫలించలేదు.

కుంభారమిట్టకు చుట్టూ, నూరు నూట యాభైకోసుల దూరంలో చదవటం రాయటం చేతనైన శబరజాతి వాడు ఒక్క శివాలుడు తప్ప మరెవరూ లేరు.

శబరులు ఆటవికులు. అరణ్యాలూ, కొండలే వాళ్ళ నివాసస్థానాలు. వేటా, పశు సంపదే వాళ్ల జీవనాధారం. వాళ్లకు నగర జీవితం తెలీదు. నాగరికులతో ఎలాంటి పొత్తూ లేదు.

ఆ పరిస్థితుల్లో చదువు సంధ్యల్లాంటివి వాళ్ళకు కొరగాని విషయాలుగా కనబడటంలో ఆశ్చర్యం లేదు. కాని, శివాలుడు యువకుడిగా వున్నప్పుడు ఒక క్షత్రియుడి వెంట దేశదేశాలూ తిరిగి రణకౌశలం, చదువా రాయా నేర్చుకున్నాడు.

వాటివల్ల జీవితంలో అతడికి ఎన్నో ప్రయోజనాలు కనిపించాయి. శిఖిముఖి మాత్రం ఈ విషయంలో తండ్రికి చాలా ఆశాభంగం కలిగించాడు.

రోజూ సూర్యోదయంతోనే శిఖిముఖి విల్లంబులూ, ఈటే తీసుకుని, వేటకై అరణ్యానికి వెళ్ళేటప్పుడు తండ్రికి చెప్పడం మామూలు. తిరిగి అతడు అరణ్యాన్నుంచి పల్లెకు రావటం సూర్యాస్తమయం తర్వాతనే.

ఒకనాటి ఉదయం శిఖిముఖి తండ్రికి చెప్పి వేటకు బయలుదేరాడు. వెంట ఎర్రగండు అనే అతడి వేటకుక్క వున్నది. దాన్ని చిన్న పిల్లగా అతడే సాకి పెద్ద చేశాడు. అది ధైర్యంలో సింహం, జిత్తుల్లో గుంటనక్క.

అరణ్యంలో వాళ్ళిద్దరూ ఒకళ్ళనొకళ్ళు తోడుగా తిరుగుతూ వేటాడేవాళ్లు. ఎర్రగండు పసిగట్టి ముందు దారి చూపేది. శిఖిముఖి దాన్ని అనుసరించి పోయి మృగాలను వేటాడేవాడు.

శిఖిముఖీ, ఎర్రగండూ అరణ్యంలో చాలా దూరం పోయారు. ఆ రోజెందుచేతో మిట్ట మధ్యాహ్నం వేళ అయినా వాళ్లకు ఒక్కలేడి గాని, అడవిదున్న గాని, అడవి పంది గాని కనిపించలేదు.

అరణ్యం ఎందువల్లనో నిశ్శబ్దంగా ఉన్నది.

అప్పుడప్పుడూ కోతులు చెట్లలో కిచకిచ మంటూ అరిచి, కొమ్మల్లో దూరి దాక్కుంటున్నవి. ఎక్కడో సింహం, మరెక్కడో పులీ పరిగెత్తుతూ అరిచినట్లుగా ధ్వని అప్పుడిక్కడా మరుక్షణం మరో దిక్కు నుంచీ వస్తున్నది.

''అంత నిశ్శబ్దం ఏమిటి? అరణ్యానికేమన్నా సుస్తీ చేసిందా? వేట జంతువులన్నీ ఎక్కడ దాక్కున్నాయి? సింహం, పులీ అలా దౌడు కెత్తుతున్నయేెం?'' అంటూ శిఖిముఖి ఎర్రగండు కేసి చూశాడు.

ఎర్రగండు నేల మూచూస్తూ కొద్ది దూరం పోయి, యజమాని వెంటరాక పోవడంతో ఆగి చిన్నగా మొరగ సాగింది.

శిఖిముఖి కుక్కకేసి గుచ్చి చూస్తూ ''ఏమిటీ, ఎండతాపానికి నీకేమైనా పిచ్చెత్తుతున్నదా? నీ మొరుగుడుకు చుట్టుపక్కల కోసుదూరంలో వున్న జంతువులైనా బెదిరి పారిపోతై,'' అన్నాడు.

ఎర్రగండు కొద్దిసేపు వూరుకుని మళ్లీ నేలను వాసన చూసి, ముందుకు పరిగెత్తి శిఖిముఖి కదలకపోవడంతో వెనుదిరిగి వచ్చి, అతడి చుట్టూ గిరికీలు కొట్టసాగింది.

కుక్క ప్రవర్తనకు ఆశ్చర్యపడుతూ శిఖిముఖి అక్కడున్న ఒక ఎండు మోడుపైకెక్కి నిలబడి కుక్క పరిగెత్తబోయిన దిక్కు కేసి చూశాడు.

అతడికి ఒక్కగానొక్క జంతువు గాని, మనిషిగాని కనిపించలేదు. కుక్క మాత్రం ఇంకా చిన్నగా మొరుగుతూనే ఉన్నది.

ఎర్రగండుకున్న పశికట్టే శక్తి గురించి



బాగా తెలిసినవాడు కావడంతో శిఖిముఖి, కుక్కను ఓసారి దువ్వి అందుబాటులో వున్న ఒక చెట్టుపైకెక్కి అక్కణ్నుంచి అది పరిగెత్తబోయిన దిక్కుకేసి పరీక్షగా చూశాడు.

అతడి దృష్టి ఒక వింత అశ్వికుడిపైన పడింది. అశ్వం, రౌతూ కూడా కవచాలు ధరించి ఉన్నారు. రౌతు నడుంనుంచి పొడవాటి కత్తి ఒకటి వేలాడుతున్నది.

కుడిచేతిలో పెద్ద ఈటె నొకదాన్ని ఎత్తి పట్టుకుని వున్నాడు. దాని అలుగు నుంచి ఒక చిన్న పతాకం ఎరుపూ పసుపూ రంగులు గలది, గాలికి రెపరెపలాడుతున్నది.

''ఇతనెవడో, అయ్యచెప్పే పురాణ కథల్లోని అతిరథుడో, మహారథుడో అయి ఉంటాడు. వెంట రథం లేదే? అహాహా భలే వేషం!'' అనుకుంటూ శిఖిముఖి నవ్వసాగాడు.

కవచాలు ధరించిన యోధుల్ని అత



డింతవరకూ చూసి ఎరగడు. ఒకటి రెండు సార్లు రాజుగారి సైనికుల్ని చూసాడు గాని వాళ్లిలా నిలువెల్లా కవచం ధరించి కనబడ లేదు.

ఆ అశ్వికుడి కేసి వింతగా చూసున్న శిఖిముఖికి మరింత ఆశ్చర్యం, భయం కొలిపే మరొక దృశ్యం కంటబడింది. ఏడె నిమిది మంది మనుషులు- వాళ్ల దుస్తుల తీరును బట్టి దారిదోపిడీ గాళ్లలా వున్నారు.

అశ్వికుడొస్తున్న మార్గానికి పైన వున్న చెట్లకొమ్మల్లోంచి, అతడికి వెనకా ముందూ ఒక్కసారిగా కిందికి దూకారు. గుర్రం బెది రింది, అశ్వికుడు దాన్ని కళ్ళెం లాగి ఆపుతూ, పెద్దగా సింహనాదం చేసి, ఒర నుంచి కత్తి దూసి వాళ్లతో తలపడ్డాడు.

శిఖిముఖికి ప్రమాదంలో చిక్కుకున్న ఆ అశ్వికుణ్ని చూసి చాలా జాలి కలిగింది. ఒక డిమీద పదిమంది కత్తులెత్తడం అధర్మం, సహించరానిది.

శత్రుబలం చూసి లొంగిపోక, అంత మందినీ ఏకాకిగా ఎదిరించి పోరాటానికి ఉపక్రమించిన అశ్వికుడంటే అతడికెంతో గౌరవభావం కలిగింది. అతడు ఎర్రగం డును హెచ్చరించి, చెట్ల ఊడలు పట్టుకుని ఊగుతూ, క్షణాల మీద అశ్వికుడున్న ప్రాంతం చేరాడు.

ఈలోపల అశ్వికుడు వాహనం మీద ఉండే దొంగలను కత్తితో ఎడాపెడా కొడుతూ, "విక్రమకేసరి కత్తి బలి కోరుతున్నది! నీచు ల్లారా పారిపోక నిలబడండి, నా ప్రతాపం తెలుస్తుంది," అంటూ గావుకేకలు పెడు తున్నాడు.

ఇంతలో ఒక దొంగ, చాటుగా వుండి గుర్రం కాలికి గురిచేసి కత్తి విసిరాడు. గుర్రం గాయపడి వేగంగా పక్కకు తిరి గింది. అశ్వికుడు ఆ కుదుపుకు కిందపడి అంతలోనే లేచి నిలబడి, ఈసారి కత్తి, ఈటె రెంటినీ రెండు చేతుల్లో పట్టుకుని, పెద్దగా హుంకరించి దొంగలను ప్రతిఘటించసా గాడు.

"శబరమాతకూ, జై" అంటూ శిఖిముఖి చెట్టుమీది నుంచి దొంగలమధ్యకు దూకాడు. ఈలోపల ఎర్రగండు ఒక దొంగమీది కురికి, వాడి కంఠం పట్టుకునేందుకు పైకెగిరింది.

అశ్వికుడు ఒక్క క్షణకాలం ఈ వచ్చిన వాడు శత్రువో మిత్రుడో అన్న అనుమా నంతో స్థాణువులా అయిపోయి, శిఖిముఖి ఈటెను దొంగలమీదికి గురిచేయటం

చూసి, ''మిత్రమా, ఈ దుర్మార్గుల్లో ఒక్కణ్ని కూడా ప్రాణాలతో పోనివ్వకూడదు.'' అని కేక వేశాడు.

ఇంతలో అరణ్యంలో ఎక్కడో దూరం నుంచి ఎవరో పెద్దగా ఈల వేశారు. మరు క్షణం దొంగలు అశ్వికుణ్ని, శిఖిముఖినీ విడిచి కలిసికట్టుగా అక్కణ్నుంచి పారి పోసాగారు.

బరువైన కవచం ధరించి ఉండటంతో అశ్వికుడు వాళ్లను వెంబడించలేకపో యాడు. శిఖిముఖి, ఎర్రగండూ వాళ్లను కొంత దూరం తరిమి, వాళ్లు అందకుండా గుబురు చెట్లలోకి పారిపోవడంతో వెను తిరిగి అశ్వికుడు ఉన్న చోటుకు వచ్చారు.

వాళ్లు వచ్చేసరికి అశ్వికుడు తన గుర్రా నికి తగిలిన గాయాన్ని పరీక్షిస్తున్నాడు. శిఖిముఖి అతడిని సమీపించి, ''ఆ దుష్టులు అందకుండా పారిపోయారు. ఈ అరణ్యంలో మీరు ఒంటరిగా ప్రయాణం చేయవల సింది కాదు. మీరేం గాయపడలేదు కదా?.. అదృష్టం. గుర్రం గాయానికి మందు వేద్దాం ఉండండి'' అంటూ దాపుల ఉన్న చెట్ల దగ్గిరకు పోయి ఆకులు కోయసాగాడు.

అశ్వికుడు మారు మాట్లాడకుండా శిఖి ముఖిని నఖశిఖ పర్యంతం పరీక్షగా చూస్తూ వుండిపోయాడు. అతడికి ఈ యువకుడు ఆటవిక జాతివాడని తెలుస్తూనే ఉన్నది. శబరమాతకూ, జై, అంటూ దొంగలమ ధ్యకు దూకాడు. బాగానే ఉన్నది. నిజంగా ఇతడు శబరుడేనా? ఇందులో మోసం ఏమీ లేదు కదా.. అశ్వికుడిలా ఆలోచిస్తున్నాడు.



శిఖిముఖి అశ్వాన్ని సమీపించి దాని గాయానికి ఆకుపసరు పూస్తూ, అశ్వికు డితో, ''మీ పేరేమిటి? ఒంటరిగా అర ణ్యంలో తిరుగుతున్నారేం'' అని ప్రశ్నిం చాడు.

అశ్వికుడు జవాబు చెప్పేందుకు ఓ క్షణకాలం తటపటాయించి, ''మనిద్దరం సమాన వయస్కులం, పద్దెనిమిదీ ఇరవై ఏళ్ళ వయసువాళ్లం, అవునా? ముసలివాళ్ల లాగా మీరూ, మీరూ అని మాట్లాడుకో వడం ఎందుకు? అది సరే. నీ ప్రశ్నలకు జవాబిచ్చే ముందు నేనొక ప్రశ్న అడగవలసి ఉంది.'' అన్నాడు.

''ఏమిటా ప్రశ్న?'' అని అడిగాడు శిఖి ముఖి, అశ్వికుడి మాటలకు కొంచెంగా ఆశ్చర్యపడుతూ.

''నీవు శబరజాతివాడివి, అవునా?'' అన్నాడు అశ్వికుడు.

''అవును నా పేరు శిఖిముఖి. మీ.. నీ పేరు?'' అన్నాడు శిఖిముకి.

''శిఖిముఖి!'' అంటూ అశ్వికుడు కళ్ళింత చేసుకుని తలాడిస్తూ, ''అది మీ తాత పేరు. అవునా? నా పేరు విక్రమకేసరి, ఇది మా తాత పేరు. మీ తండ్రి శివాలుడు, ఆ విక్రమకేసరిని గురించి నీకు చెప్పే ఉండాలే. ఆయన క్షేమంగా ఉన్నాడు గదా?'' అని ప్రశ్నించాడు విక్రమకేసరి.

విక్రమకేసరి మాటలు వింటూంటే శిఖిముఖికి ఏదో కల గంటున్నట్లుగా ఉంటున్నది. తను జన్మలో అతణ్ని చూడటం తటస్థపడుతుందని అతడేనాడూ అనుకోలేదు...

''నా తండ్రి క్షేమంగానే ఉన్నాడు. మీ తాతగారిని గురించి నేను చాలా విన్నాను. మీది శూరసేన దేశం కాదా? నీ ప్రయాణం మా పల్లెకే అని తెలిసిపోయింది. కాని, ఇదంతా నాకు నమ్మశక్యం కాకుండా ఉన్నది,'' అన్నాడు శిఖిముఖి.

''ఇంకా నమ్మశక్యం కాని సంగతులనేకం మీ ఇంటికి చేరింతరవాత తీరిగ్గా చెబుతాను. ఇంతకుముందు నన్ను చుట్టుముట్టినవాళ్లు కేవలం దొంగలు కాదు. వాళ్ళక్కావలసింది, ఈ జీనుకు వేలాడుతున్న సంచీయే కాక, నా ప్రాణం కూడా. కనక మనం త్వరగా మీ పల్లె చేరటం క్షేమం,'' అన్నాడు విక్రమకేసరి.

ఆసరికి శిఖిముఖికి తామున్న ప్రదేశం ఎంత ప్రమాదకరం అయిందో తెలిసి వచ్చింది. దొంగలు ఏ చెట్లచాటునో పొంచి వుండి తిరిగి మీద పడేందుకు అవకాశం కోసం ఎదురు చూస్తుంటారు..

గాయపడిన గుర్రాన్ని నడిపించుకుంటూ శిఖిముఖీ, విక్రమకేసరీ కుంభారమిట్ట పల్లెకు బయలుదేరారు. దారిలో శిఖిముఖి ఒక అడవిపందిని కొట్టి భుజాన వేసుకున్నాడు.

దొంగల నుంచి మరే ప్రమాదం ఎదురవలేదు. కాని, చీకటి పడిన కొంత సేపటికి వాళ్లు పల్లెను సమీపించేసరికి, శివాలుడూ, మరికొందరూ అరణ్యం కేసి వస్తున్నారు.

శిఖిముఖిని ముందుగా చూసిన పల్లెవాసులు కొందరు ఉత్సాహంగా కేకలు వేస్తూ, అతడి దగ్గరికి పరిగెత్తుకు రాసాగారు.

– దాసరి సుబ్రహ్మణ్యం







# నూతన సామ్రాజ్యం

(రజతవర్ణ గోళాకారపు రోదసీ వాహనం ఆశలను మోసుకువస్తున్న చంద్రుడిలా ఆకాశంలోంచి దూసుకొచ్చింది. అప్పుడు మాత్రమే నేను మానవులను ఎంతగా కోల్పోయిందీ నాకు బోధపడింది.)

రోదసీ వాహనం క్రమంగా అనునిర్వలో దిగ నారంభించింది. మేమంతా పైకి చూస్తున్నాం, మైకంలో ఉన్నాం. గాలి దట్టంగా ఉండి భయ పెడుతోంది. నా తల్లిదండ్రులు అక్కడ ఉంటారని ఆశించాను.

మెరుపు మెరిసినట్లు సైబీరియా తెల్లపులి తన నీలి కళ్ళతో నాకేసి ఎగాదిగా చూస్తోంది. 'ఇక్కడికి రా.' అంటూ అది కఠోరంగా గాండ్రిం చింది. నేను ఎన్నడూ అవిధేయత ప్రదర్శించ



లేదు. దానికేసి మెల్లగా అడుగులేశాను.

''ఇక్కడ మరొక మానవుడున్నాడు. నాకు తెలుసు'' అని చెప్పింది. భీకరంగా, భారీగా ఉన్న తన తలను అది నావైపు జరిపింది. దాని నూపురంపై మంచువంటి తెల్లని వెంట్రుకలను నేను చూశాను.

నల్లటిపట్టీలు అటూ ఇటూ ఊగుతున్నాయి. నేను తలూపాను. ''స్వరూపాలు మారతాయని గుర్తుంచుకో, నీ బంధువులాగా కనబడేదే నీకు హాని కలిగిస్తుంది'' అంటూ నిట్టూర్చింది.

''దురదృష్టవశాత్తూ చెడుకు కూడా అనేక రూపాలున్నాయి'' అలా చెబుతూ అది రోదసీ వాహక నౌక కేసి చూసి మరేం మాట్లాడలేదు.

మయూరి ఒక అడవి ఎద్దును ఆనుకుని నిలబడింది. ఆమె పెదవులనుంచి వింత చిరు నవ్వు కదలాడుతోంది. రోదసీ వాహక నౌక రాన్రానూ మరింతగా దగ్గరయింది.

చిన్న అద్దపు కిటికీల గుండా పట్టి పట్టి చూస్తున్న రూపాలను నేను చూడగలిగాను. ఒక క్షణం నేను విచారంలో కూరుకుపోయాను. మానవులచే మరొక స్థలం ఆక్రమించబడింది. రోదసీనౌక నెమ్మదిగా నేలమీద వాలి ఒక్క కుదుపుతో ఆగిపోయింది.

క్షణ కాలం గడిచింది. తర్వాత మరో క్షణం. నౌక లోపలి వారు వారి సమయం కోసం కాచు



కుని ఉన్నట్లు కనిపించింది. నేను జోక్యం చేసుకోవాలని నిశ్చయించాను. రోదసీ నౌక వేపుగా నడిచి అరిచాను. ''బాగుంది, మీరు క్షేమంగా దిగారు. బయటకు రండి! నేను శివను, నేను మానవుడిని!''

నా గంభీర ప్రకటనతో నిశ్శబ్దం అలుముకుంది. చీనా ఏనుగు మెత్తగా నిట్టూర్పు విడిచింది.

దాన్ని లెక్క చేయకుండా, నేను ఓ కిటికీ వద్దకు వెళ్లి లోపలకు ప్రవేశించాను. నా వెనుక పలురూపాలు, వర్ణాలు కలిగిన జీవులు భయకంపిత వదనాలతో నిలబడ్డాయి. అవి నేలమీద సాగిలబడి వేటకు సిద్ధంగా ఉన్నట్లు కనిపించాయి.

అప్పుడు దోమలవత్తిని పోలిన జుత్తుతో కూడిన తలతో ఓ వ్యక్తి నేలమీదనుంచి లేచి నెమ్మదిగా కిటికీవైపు వచ్చాడు. అతడు ''హలో'' అని చెప్పగానే నేను ఆనందంగా చేయిసాచాను.

ఏమైతే నేమి, మరొక మానవుడు కనబడిన వెంటనే నాలో ఉత్సాహం పెల్లుబికింది. అప్పుడతడు తలుపువైపు వస్తున్నట్లు కదిలాడు. నేను తలూపి తలుపు వద్ద నిలబడ్డాను.

ఆ మనిషి తలుపు తెరిచి అన్నాడు ''ఏయ్ మేం మృతజీవులమా?''

నేను నవ్వి చెప్పాను. ''ఖచ్చితంగా చెప్పలేను. కావచ్చు, కాకపోవచ్చు!'' అతడు పొడి నవ్వుతో నాకేసి చూశాడు.

ఇలాంటి కొత్త నేల మీదికి వచ్చినందుకు వారు నిజంగా దిగ్భ్రాంతికి గురై ఉండవచ్చు. నేను చేయి చాపాను, అతడు నా చేతిని పట్టుకుని ఇంకా తలుపువెనుకే ఉండిపోయాడు.

''బయటకు రండి'' నేను పిలిచాను. ''మీరు ఇప్పుడు అనునిర్వలో ఉన్నారు. అంతరించిపోయిన జీవుల నేల.''

''అను... ఏమిటది?'' అతడు తడబడ్డాడు. ''మనం అంతరించిపోయాం. ఈ విషయం నీకు తెలుసా?''

అతడు నాకేసి వింతగా చూశాడు. నా మానసిక స్థితిని సందేహిస్తున్నట్లుగా చూశాడు. తర్వాత, అతడు నా వెనుకవైపుకు చూశాడు.

జంతువుల మంద చీమచిటుక్కుమంటే వినిపించేంత నిశ్శబ్ద వాతావరణంలో లేచి నిలబడి వేచి చూస్తోంది.

అతడు పళ్ళు బిగించి తలుపు దడేలున మూసివేసాడు. ఇలాంటి వాతావరణంతో నేను అలసిపోయాను. ''లేచి నిలబడు'' నేను అరచాను.



ఏదో నీడ నన్ను దాటినట్లనిపించి నేను గిర్రున తిరిగాను. ఎదురుగా మయూరి. ''ప్రశాంతంగా ఉండు. నేను మాట్లాడతా'' చెప్పింది.

''మానవులారా,'' ఆమె విస్పష్ట స్వరంతో మాట్లాడటం ప్రారంభించింది. ఆ పదం పెటిల్లున నేల నలుచెరగులా ప్రతిధ్వనించింది. నేను ఎగిరి పడ్డాను.

''మీరు నిర్భీతిగా బయటకు రావచ్చు. నేను, మయూరిని, అనంతాన్ని. ముందుకు రమ్మని మిమ్మల్ని కోరుతున్నాను. మీకు ఏ ప్రమాదమూ జరగదని నేను మాట ఇస్తున్నా.''

తక్షణం నైలు మొసలి అభ్యంతర సూచకంగా నోరు తెరిచింది. అయితే మయూరి దాన్ని హెచ్చరిస్తున్న చూపుతో నివారించింది.

మొసలిని ఆపడం అంత సులభం కాదు. అది తన తోకను నేలమీద గట్టిగా తాడించింది కానీ నోరు విప్పే సాహసం చేయలేదు.

సైబీరియా పులి చిన్నగా గాండ్రించింది. డైనోసార్లలో ఒకటి నన్ను కన్నార్పుతూ చూసింది. ఒక్కసారిగా నాకు కంపరమేసింది. దాని కోరల బారిన పడితే ఏమవుతుందో నాకు తెలుసు.

తలుపు నెమ్మదిగా తెరుచుకుంది, ఆ సన్నటి మనిషి రోదసీ వాహనం నుంచి మెల్లగా బయటకు వచ్చాడు.

అతడి ముఖం బాగా పాలిపోయింది. కళ్ళు రెపరెపలాడుతున్నాయి. అతడి చేతినిండా గాయాలు. అతడి దుస్తులనిండా మరకలు, అతడి తలలో ఇసుక.

''ఏంటీ.. ఎవరీమె?'' అతడి కళ్ళు ఆమె నీలిముఖాన్ని, నాలుగు చేతులను తేరిపారజూశాయి.

అతడు హాని కలిగించే మాట ఏదో చెప్పబోతున్నాడని భయపడ్డాను. అతడిని అడ్డుకుంటూ ''ఈమె మయూరి'' అని చెప్పాను.

''హు... మయూరి... సరే... అందుకే ఈమె ఒక...'' అతడు ఆలోచిస్తూ గడ్డం గీక్కున్నాడు. ఉన్నట్లుంటి చీనా ఏనుగు పైకి లేచింది, ఆ వ్యక్తి జాగ్రత్తగా వెనుకడుగు వేశాడు.

''ఏయ్, ఏయ్...!'' అతడు సన్నగా గొణిగాడు. ''నాకు పిచ్చెక్కుతోంది. కాదా'' అతడు లోగొంతుకతో అన్నాడు.

చీనా ఏనుగు అతడి వైపు కదిలి అతడి ముఖాన్ని పరిశీలనగా చూసింది. ''అరెరెరె... నువ్వా.... నువ్వా చీనా ఏనుగు కదూ?''

తన ప్రశ్న తనకే అసంబద్ధంగా అనిపించ

డంతో అతడిలా అడుగుతూ పడిపడి నవ్వాడు. అతడి స్వరంలో స్పష్టంగా కించభావం ధ్వనించింది.

అయితే చీనా ఏనుగు సంతోషించ లేదు. అది తన దంతాలలో ఒకదాన్ని అతడి కళ్ళకు దగ్గరగా తీసుకువచ్చింది. ''నీవు కోరుకుంటే, నేను ఏనుగునే అని నిరూపిస్తాను.''

అతడు భయపడుతూ వెనక్కు తగ్గాడు. ''నీవు మాట్లాడవచ్చు!'' చెప్పింది మయూరి. అతడు ఊపిరి పీల్చుకున్నాడు.

చీనా ఏనుగు చెవిని సుతిమెత్తగా తడుతూ మయూరి చెప్పింది. ''నిన్ను నీవు రుజువు చేసుకోవడానికి ఇంకా సమయముంది. ఇప్పుడు వెనక్కు తగ్గు. మన అతిథులను ముందుగా ఆహ్వానిద్దాం రా!'' అంటూ ఆమె మానవుడి వైపు చేయి చాచి అడిగింది. ''మీ పేరేమిటో చెబుతారా మానవా''

అతడు ఆమె చేయి ఆతృతగా పట్టుకున్నాడు గాని, కరచాలనం చేయలేదు. ఎవరో నాగుపామును తన చేతికిచ్చి పట్టుకోమన్న చందంగా కనిపించాడతడు.

''నేను శంతనుడిని'' చెప్పాడు. ''పూర్తిగా అంతరించిపోకుండా ప్రజలను ఈ పరివర్తన లోకి మార్చేందుకు గాను ప్రభుత్వం నియమించిన శాస్త్రజ్ఞులలో నేనూ ఒకడిని.

దీన్ని సాధించడానికి ప్రపంచవ్యాప్తంగా శాస్త్రజ్ఞులతో సమన్వయంతో పనిచేయాలని మమ్మల్ని ఆదేశించారు. కాని.... '' అతడు ఊపిరి పీల్చుకున్నాడు.

కొన్ని ముఖాలు కిటికీ వైపుకు తిరిగి నవ్వుకుంటున్నట్లు నేను గమనించాను. వారు పగలబడి నవ్వడం ప్రారంభించడంతో వారిని పిల్లలుగా గుర్తించాను. ''బయటకు రండి'' నేను తలుపువైపు తిరుగుతూ గట్టిగా అరిచాను.

ఉన్నట్లుండి వాళ్లు వెనక్కు తిరిగి మరొకరితో మాట్లాడసాగారు... క్షణమాత్రంలో వారు రోదసీ వాహనం నుంచి బయటపడ్డారు.

ఆ అబ్బాయి సిగ్గుపడుతూ ఉన్న ఒక బాలికను మయూరి వైపుకు నడిపించుకొచ్చాడు. అయితే ఆ పాప ఆందోళన పడలేదు.



అబ్బాయి ఇద్దరిలో చిన్నవాడిలా కనిపిస్తున్నాడు. ఏడేళ్ళు ఉండవచ్చు. నా ఉద్దేశం ప్రకారం బాలికకు మాత్రం పన్నెండేళ్ళు ఉండవచ్చు.

''వావ్!'' అన్నది బాలిక. మయూరి నవ్వింది. ఆమె



కాస్త వంగి బాలిక తల తట్టింది. అంటే ఆమె తల్చుకుంటే మర్యాదగా ఉంటుందన్నమాట. తెరుచుకున్న నోటితో బాలిక మొదలెట్టింది. ''నీవెందుకు నీలంగా ఉన్నావు?'' అడిగింది. గట్టిగా, స్పష్టంగా ఉంది స్వరం.

''ఆహా!'' చీనా ఏనుగు గొణిగింది.

''నైలు మొసలి ఆశ్చర్యపడింది. గుర్రం విషాద సూచకంగా సకిలించింది!''

సైబీరియన్ పులి మృదువుగా నవ్వింది.

మయూరి ఫక్కున నవ్వింది. ''నిజంగా ఎందుకలా ఉన్నాను!'' ఆమె స్పందించిన తీరుతో నేను కాస్త వెనక్కు తగ్గాను. కాని బాలికను చూసి నేను సంతోషపడ్డాను. తన అసహనానికి గాను మయూరి ఆగ్రహానికి బాలిక గురికాలేదు మరి. (నైలు మొసలి ప్రకారం అలా జరగాల్సి ఉండె.)

ఆ అబ్బాయి ఉన్నట్లుండి అరచాడు. ''నీ వెనకాల పులి ఉంది నిమ్మీ!''

నిమ్మీ దృఢంగా తయారైనట్లుంది. ఆమె కనురెప్పను కూడా కదిలించలేదు. సైబీరియన్ పులి వైపు ఆమె స్థిరంగా చూసింది. ప్రస్తు ప్రదర్శన శాలలో ఉన్న కళాకృతిని పరిశీలిస్తున్న చందంగా చూసింది. మెల్లగా పులివైపు అడుగేసింది. పులికి దగ్గరగా వచ్చినప్పుడు ఆమెను శంతను ఆపాడు.

''పులి వద్దకు పోవద్దు. వెనక్కి వెళ్ళి లోపల ఉండు,'' అతడు అరిచాడు. ఆమె అతడికేసి ప్రశాంతంగా చూసింది. అయితే మారు మాట్లాడకుండా ఆమె అతడి మాటలను పాటించింది.

''మనందరం, అంటే.. రోదసీ వాహనంలోని మానవులం ముందుకు అడుగేయడానికి ముందు నేను కొన్ని వివరాలు తెలుసుకోవాలని అనుకుంటున్నా. మనం ఇప్పుడు ఎక్కడున్నాం? ఈ దేశం ఏది? ఇక్కడి ప్రాణులన్నీ ఎలా మాట్లాడగలుగుతున్నాయి?'' అంటూ అతడు రెట్టించాడు.

''అడవిదున్న తన కాలిని గట్టిగా తాడించింది.

మేం మాట్లాడలేమని నీవు ఎలా అనుకున్నావు?'' అడిగింది.

''అతడి ఉద్దేశం ఏదంటే మానవ భాష మీరు ఎలా మాట్లాడుతున్నారనే,'' నేను మాట కలిపాను. ''అలాగా, కృతజ్ఞతలు,'' శంతను సుదూర దృశ్యం వైపు నన్ను తోస్తూ చెప్పాడు.

అనునిర్వ అధికారిక ద్వారపాలకులు

లెమన్, ఒమెన్‌లు అంతకు ముందు నాకు చెప్పిన విషయాలను మళ్ళీ శంతనుడికి వివరించడం మొదలెట్టారు.

ఆ అసాధారణ గాథను వినే కొద్దీ అతడి ముఖం పాలిపోతూవచ్చింది. అతడి కళ్లు అవిశ్వాసంతో నిండిపోయాయి. చూస్తున్న నాకు ఆశ్చర్యం కలగలేదు.

నేను కూడా వాటిని మొదటిసారిగా కలిసినప్పుడు ఇలాగే దిగ్భ్రాంతిలో మునిగిపోయాను. అయితే నేను ఊహించిన దాని కంటే ధైర్యంగానే అతడు మొత్తంగా విన్నాడు.

''అంటే మానవులు ఇప్పుడు అంతరిస్తున్నారని మీరు చెబుతున్నారు. అంతేగా?'' అని ప్రశ్నించాడు.

''అవును'' ఒమెన్ దృఢస్వరంతో అన్నాడు. నొక్కి చెప్పడానికి భుజాలు ఎగురేశాడు.

''అంటే మాలో చాలామంది ఇక్కడికి వస్తారన్నమాట.''

అవును. అలాగే జరుగుతుంది.

''మరి మేమెక్కడ ఉండాలి?''

''గాభరా పడవద్దు, మేం ఇప్పటికే ఏర్పాట్లు చేసే ఉంచాం,'' చెప్పింది మయూరి ప్రశాంతంగా. చాలా జంతువులు దీంతో ఆశ్చర్యానికిలోనయ్యాయి. నేను ఆశ్చర్యపడలేదు. మానవులపై జరిగిన చర్చకు సంబంధించిన కార్యక్రమంలో ఆతిథ్యం ప్రస్తావనకు రానట్లుంది!

''వారు జలదేవతల సహాయంతో జలగర్భ గుహల్లో ఉంటారు'' చెప్పింది మయూరి.

''సముద్ర గర్భంలోనా?!'' ఆశ్చర్యపోయాను.

''నువ్వు చూస్తావు కదా,'' ఆమె చెప్పింది.

ఆమె చెప్పింది అర్థం కానట్లుగా చూశాడు శంతను. అప్పటికప్పుడు ఒక నిర్ణయానికి వచ్చినవాడిలా తలను ఊగించి, రోదసీ వాహనం కేసి నడిచాడు. దాని తలుపు తెరిచి, మెల్లగా చూశాడు.

లోపలున్న వారు నెమ్మదిగా బయటకు వచ్చారు. ఒక్కరొక్కరుగా మెల్లగా, భయపడుతూ, ఆందోళనతో బయటకి వచ్చారు. వారు ముఖాలు వాల్చేశారు. వారి వీపు భాగం వంగిపోయింది. మానవులు అధినాథులు కాని నేలమీదికి వారు వచ్చారు మరి. (ఇంకా ఉంది)

– సౌమ్యారాజేంద్రన్



# చందమామ కబుర్లు

## ఆస్ట్రేలియా అద్భుత విద్యార్థిని




భారత సంతతికి చెందిన విద్యార్థిని సిడ్నీ నగరంలో న్యూరో–సైన్స్ రంగంలో జరిగిన పోటీలో ఆస్ట్రేలియా లోనే అత్యద్భుత మేధస్సు కలిగిన విద్యార్థిగా నెగ్గింది. పెర్త్ లోని షెంటన్ కాలేజీకి చెందిన ఉమా ఝా, దేశ వ్యాప్తంగా 4వేల పోటీదారులను అధిగమించి ఈ పోటీలో నెగ్గింది.

2010 ఆస్ట్రేలియన్ బ్రెయిన్ బీ ఛాలెంజ్ పోటీలో వివిధ రంగాలలో హైస్కూలు విద్యార్థుల ప్రతిభను పరీక్షించారు. రాష్ట్ర స్థాయి విజేతలు పాల్గొన్న ఈ జాతీయ పోటీలో ఉమా ఝా తలపడవలసివచ్చింది. ఈ పోటీలో బ్రెయిన్ టెస్టింగ్ అనాటమీ పరీక్ష, డాక్టర్–పేషెంట్ డయాగ్నసిస్, న్యూరో సైన్స్ క్విజ్ వంటి అంశాలను కూడా చేర్చారు.

ఉమా ఇలా అంటోంది. ''పోటీ చివరి వరకు తీవ్రంగా జరిగింది. గతంలో నేను ఏ జాతీయ పోటీలోనూ నెగ్గలేదు. కాబట్టి గెలుపు అద్భుతంగా ఉంది''

## పంజర గృహాల్లో ప్రజలు

మీ స్వంత అన్నదమ్ములతో కలిసి ఒకే రూమ్ పంచుకున్నారా? అయితే హాంకాంగ్ నివాసి చుంగ్ ఫార్ లావ్ నివాసం గురించి తెలుసుకోవలసిందే మరి.

చుంగ్ కేవలం 625 చదరపుటడుగుల ఫ్లాట్‌లో 18 మంది కొత్తవారితో కలిసి నివసిస్తున్నాడు. వీటికి పంజర గృహాలు అని ప్రసిద్ధి. మామూలు ఇళ్లను పంజరాలుగా మార్చి రూపొందించారు. దీంట్లో నివసిస్తున్న వారినుంచి నెలకు 2,500 డాలర్లను అద్దెగా వసూలు చేస్తున్నారు.




ఘనాకారంలో ఉండే ఈ చిన్నగదుల్లో మొత్తం 19 మంది నివసిస్తుండగా వీరికి రెండు మరుగుదొడ్లులు మాత్రమే ఉన్నాయట. ఈ దయనీయ స్థితిని వెలుగులోకి తేవడానికి హాంకాంగ్‌లోని స్కోయెనీ వస్తుప్రదర్శనశాల ఓ కొత్త పంథా అవలంబిస్తోంది. ఏటా నిర్వహించే కళాత్మక చిత్ర ప్రదర్శనలో ఈ కొత్తరకం పంజరాలను కూడా ప్రజలకు అందుబాటులో ఉంచింది.

# ఉదయ తారలు

విశేషాలు

- ఆదర్శ క్రీడాకారుడు: గ్యారీ కాస్పరోవ్.
- ఇతర అభిమాన క్రీడలు: ఫుట్‌బాల్, క్రికెట్

సాధించిన విజయాలు:

- U-11 జాతీయ ఛాంపియన్‌షిప్ 2005
- U-13 జాతీయ ఛాంపియన్‌షిప్ 2006, 2007
- ప్రపంచ యు-14 ఛాంపియన్‌షిప్, వియత్నాం, 2008
- కామన్‌వెల్త్ గోల్డ్ మెడల్, నాగపూర్, 2008
- U-15 జాతీయ ఛాంపియన్‌షిప్, ముంబై, 2009
- U-16 వరల్డ్ సిల్వర్ మెడల్, టర్కీ, 2009
- ఇంటర్నేషనల్ మాస్టర్ టైటిల్, 2009. దీంతో 2500 రేటింగ్ సాధించాడు.

## విదిత్ గుజరాతీ



మెదడుకు మేత పెట్టడంలో చదరంగానికి సాటి వచ్చే క్రీడ లేదు. చదరంగం అంటే విదిత్‌కు ప్రాణం. నాసిక్‌కు చెందిన ఈ బాల క్రీడాకారుడు ఏడేళ్ల వయసు నుంచి చదరంగం ఆడుతున్నాడు.

ప్రవాసి అకాడెమీలో 10వ తరగతి చదువుతున్న విదిత్ మాటల్లో చెప్పాలంటే చదువు, క్రీడ రెండింటినీ సమాన ప్రాధాన్యత ఇవ్వడమే నిజమైన పరీక్ష అట! ''టోర్నీల కారణంగా నేను చాలా సార్లు పాఠశాలకు రాలేను, కానీ మనిషికి మినహాయింపులు అవసరమే,'' అని తెలివిగా వ్యాఖ్యానిస్తాడు విదిత్.

విదిత్ అభిప్రాయం ప్రకారం 'చిగోరిన్ స్మారక ఓపెన్' చాలా సవాళ్లతో కూడుకున్న ఆట. ''రష్యన్లపై పోటీ పడటం చాలా కష్టం, నిజంగానే సవాలుతో కూడుకున్నది'' అంటాడు విదిత్.

గ్రాండ్ మాస్టర్ కావడం అతడి తక్షణ లక్ష్యం. భవిష్యత్తులో 2650 రేటింగ్ పాయింట్లను దాటాలని అతడి కోరిక. (ప్రస్తుతం అతడి రేటింగ్ 2505 పాయింట్ల వద్ద నిలిచింది.)

ఆటలంటే ప్రాణమిచ్చేవారికి విదిత్ ఇచ్చే సలహా ఒక్కటే. ''ఆటను ఆస్వాదించండి. ఫలితం గురించి ఆలోచించవద్దు. మీరు కష్టపడితే ఫలితం దానికదే వస్తుంది. ఇవే ఆట సమయంలో బాగా ప్రభావితం చేస్తాయి!'' అని అంటాడు.

ఈ చెస్ మాస్టర్‌కు, ఈ నెల ఉదయతారకు చందమామ శుభాకాంక్షలు చెబుతోంది.



# నవ్వుల పువ్వులు



''హలో... గ్రంథాలయం ఏ సమయంలో తెరుస్తారు''

''అర్థరాత్రి మీరు నాకెందుకు ఫోన్ చేస్తున్నట్లు?''

''ఏం లేదు లైబ్రరీ నుంచి బయటకు రావాలనుకుంటున్నా''



తల్లి: కన్నా ఇంటికి ఇంత త్వరగా వచ్చేశావేమిటి?

కొడుకు: ఒక ప్రశ్నకు జవాబిచ్చాను.

తల్లి: నిజంగా, ఆ ప్రశ్న ఏమిటి?

కొడుకు: ప్రిన్సిపాల్ మీదికి ఎరేజర్ విసిరిందెవరు?



''పాలను కలిగిన అయిదు వస్తువుల పేర్లు చెప్పగలవా?''

''ఐస్‌క్రీమ్, టీ, కాఫీ, పాయసం, రెఫ్రిజిరేటర్, మరియు మా పొరుగింటి ఆవు!''



టీచర్: శక్తిని వృధా చేసుకోవడంపై ఓ పెద్ద ఉదాహరణ చెప్పు?

స్టూడెంట్: ''చెప్పగలను సర్. బట్టతల గల మనిషికి జుత్తు పెంచడం ఎలా అనే చిట్కాలు చెప్పడం.''

## అల్లరి దత్తు











# హాస్యకథ

## టీవీ బాటలో...

గోపాల్ చెప్పాడు, ''అమ్మా రిమోట్ ఇవ్వు... నేను ప్రపంచకప్ చూడాలి!''

'నేనివ్వన్రా! నేను ఈ కొత్త ప్రోగ్రామ్ చూస్తు న్నాను'' అమ్మ చెప్పింది.

''మర్చిపోవద్దు... ఈ రోజే గేమ్ షోలో చివరి భాగం. ఎట్టిపరిస్థితుల్లో మనం దాన్ని మిస్ కావద్దు మరి,'' గుర్తుచేసింది అమ్మమ్మ.

''మరి నేను మ్యాచ్ ఎప్పుడు చూడాలీ?'' ఎగిరాడు గోపాల్ .

అమ్మ జవాబివ్వలేదు. ఆమె రిమోట్ కంట్రోల్‌ని గట్టిగా పట్టుకుంది. దానివెనుకే అమ్మమ్మ కవచంలాగా కూర్చునేసింది.

గోపాల్ బయటకు వెళ్లిపోయాడు. మైదానంలో తన స్నేహితులంతా ప్రహరీ గోడపై కూర్చుని ఉండగా చూశాడు.

''మీరు ప్రపంచ కప్ చూడటం లేదా?'' గోపాల్ అడిగాడు.

''మనల్ని టీవీ చూడనిచ్చేదెవరు?'' షెర్మీ అసమ్మతితో చెప్పింది.

అవినాష్ తలూపాడు. 'నేను కార్టూన్‌లు చూడాలనుకున్నా కానీ చూడలేకపోయా. నాన్న ఎప్పుడు చూసినా వార్తలు పెట్టుకుని వింటూంటాడు. నాకయితే చాలా విసుగ్గా ఉంది. ''

''నాకు నచ్చిన ప్రోగ్రాం చూడాలనుకుంటే అమ్మ హోమ్ వర్క్ చేసుకోమని తరిమింది'' మీనా కోపంగా అంది.

గోపాల్ కాస్సేపు పెదవి కొరుక్కున్నాడు. ''నాకో మంచి ఐడియా తట్టిందిరా... మనం చేయవలసిందల్లా వాళ్లని ఇంట్లోంచి బయటకు తరమడమే!''

పిల్లలు తమ తొలి పథకాన్ని రూపొందించుకున్నారు. గోపాల్ తన ఇంటిలోకి వెళ్లగానే న్యూడిల్స్ ప్యాకెట్‌ను లాగాడు. అమ్మ దాన్ని చూసి కనుబొమలెగరేసింది.



గోపాల్ అల్లరిగా నవ్వాడు. అమ్మ సరైన దారిలోనే ఉంది మరి. ''ఓ.. రామ్మా! మనం చాలా దృఢంగా ఉన్నాం కదా, మనం గంటల కొద్దీ ఆటాడగలం.. మనకంత శక్తి సామర్థ్యాలు ఉన్నాయి మరి!'' గర్వంగా చెప్పాడు గోపాల్

అమ్మ ఫక్కున నవ్వింది. ''నేను చిన్నదానిగా ఉన్నప్పుడు నీకంటే ఎక్కువ సేపే ఆడేదాన్ని!'' అమ్మమ్మ తలూపింది.

''కానీ మీరు ఆడేది స్కిప్పింగ్,



అచ్చనగాయలు వంటి చిన్నపిల్లల ఆటలే కదా,'' తీసిపారేశాడు గోపాల్.

''మీరు మాతో కలిసి ఫుట్‌బాల్ ఎందుకు ఆడకూడదు?'' గోపాల్ ప్రతిపాదించాడు.

అమ్మ తల అడ్డంగా ఊపింది. ''ఏమిటీ... ఫుట్‌బాల్? లేదు, లేదు...''

''అమ్మా, మీరు మైదానంలో అద్భుతాలు సృష్టిస్తామని మాకు నిరూపించి చూపండి. రండి'' గోపాల్ చెప్పాడు. అమ్మ నాటకీయంగా రిమోట్‌ను సోఫామిదికి విసిరి గోపాల్ చేతుల్లోంచి ఫుట్‌బాల్‌ను తీసుకుంది.

''రా పోదాం!'' అన్నది అమ్మ. గోపాల్ ఎగిరి గంతేశాడు. అతడి పథకం పనిచేసింది.

స్పష్టంగానే చాలా మంది పిల్లలు తమ తమ ఇళ్లలో ఇలాగే తమ పెద్దవారిని రెచ్చగొట్టారు. దీంతో తల్లితండ్రులు ఇళ్లలోంచి బయటకు వచ్చి మైదానంలో గుమిగూడారు. ఫుట్‌బాల్ ఆడేందుకు సిద్ధమయ్యారు.

సాయంకాలం దీర్ఘంగా సాగిపోయింది. షెర్మీ, అవినీష్ వారిని రెండు గ్రూపులుగా విభజించారు. తర్వాత గోపాల్ గోల్‌పోస్టని నిర్ణయించి ఆట నిబంధనలను పూర్తిగా వివరించాడు. గోపాల్ తల్లి జట్టు గోల్ కీపర్ కాగా సుమీ నాన్న అవతలి జట్టులో గోల్ కీపర్‌గా నిలబడ్డాడు.

''సరే, బంతిని ఎవరు ముందు ఆడబోతున్నారు?'' గోపాల్ అడిగాడు. ''అంకుల్ మీరేనా''

అబ్దుల్ అంకుల్ గాభరాగా ముందుకొచ్చాడు. శక్తినంతా ఉపయోగించి బంతిని తన్నాడు. గోపాల్ తల్లి ముందుకొచ్చి బంతిని సరిగ్గా పట్టేసుకుంది. ఆమె జట్టు అభినందన సూచకంగా చప్పట్లు కొట్టింది.

''చాలా బాగా ఆడావ్ సీమా,'' ఆమె స్నేహితురాలు సుజి ప్రశంసించింది.

''నువ్వు కూడా గోల్ పోస్ట్ వద్దకు రా సుజీ'' ఆమె పిలిచింది.

''అమ్మా గోల్‌పోస్ట్ వద్ద ఒక్కరే ఉండాలి,'' గోపాల్ అడ్డుకున్నాడు.

''అదేం కుదరదోయ్...'' కొట్టివేసింది గోపాల్ అమ్మ.

తర్వాతి వంతు షెర్మీ వాళ్లమ్మది. ఆమె బంతిని నైపుణ్యంగా కాలుతో జరుపుతూ పోయింది. ''బంతిని చేతితో తాకకూడదు'' అవినాష్ మొదలెట్టాడు. అయితే ఆమె అతడి అభ్యంతరాన్ని తోసిపుచ్చి గట్టిగా అన్నది. ''ఏం ఫర్వాలేదు. మేం ఇలా కూడా దాన్ని విసురుతాం'' ఎవరో బంతిని రెండు చేతులతో గట్టిగా పట్టుకుని నెట్ లోకి విసిరారు. మరో వైపున గోల్ కీపర్‌లు నెట్‌కి దగ్గరగా వచ్చిన వారిని అలాగే ముందుకు తోయడం మొద

లెట్టారు. మరి కొందరు బంతిని నెట్ పైభాగం లోకి విసరవలసిందిగా అరిచారు. ''చాలా బాగా విసిరావు!'' ఆమె అందరినీ ఉత్సాహప ర్చింది.

ఆ మర్నాడు సాయంత్రం గోపాల్ అమ్మ తనను పిలిచింది. ''బంతి ఎక్కడరా?'' గోపాల్ బంతిని ఆమె వైపుకు విసిరాడు. ఇక మైదా నంలో అయితే అప్పటికే చాలామంది జనం గుమికూడారు.

''పథకం అదిరింది గోపాల్'' షెర్మీ గుసగుస లాడింది.

అది చక్కటి వారం. గోపాల్ క్రికెట్ ఆటలోని ప్రతి క్షణాన్ని ఆస్వాదించాడు. తననుంచి రిమోట్ లాక్కునే వారు లేరు. కొత్తఛానెల్ వైపు తిప్పే వారు లేరు. తర్వాత ప్రపంచ కప్ వైభవంగా ముగిసిపోయింది. బ్యాట్ తీసుకుని క్రికెట్ ఆటాడుకోవాలని తహతహ పిల్లల్లో ప్రబలిపో యింది.

వాళ్లు అవినీష్ ఇంటి ఆవరణలో సమా వేశమయ్యారు.

''టీవీ చూసేందుకు ఎంత చక్కటి పథకం వేశామో మన వాళ్లకు చెబితే వాళ్లెంత ఆశ్చర్య పోతారో ఊహించుకోండి ఓసారి!'' షెర్మీ పకపకలాడింది.

''మనం ఈ విషయాన్ని బయటపెట్టి నవ్విద్దాం రండి. తర్వాత చక్కగా ఆటాడు కుందాం!'' గోపాల్ చెప్పాడు.

అయితే, వారు ఆటస్థలం లోకి వెళ్లేసరికి రోజూకన్నా ఎక్కు వమంది అక్కడ చేరి ఉన్నారు.

గోపాల్ తన తల్లి వద్దకు వెళ్లి, ''అమ్మా, మేం ఆటాడుకోవాలి, పోయి మీరు కోరిన ఛానెల్స్ పెట్టుకుని చూడండి.''

''నాన్సెన్స్... అద్భుతంగా సాగే ఫుట్‌బాల్ ఆట విడిచిపెట్టి టీవీ చూడాలని ఎవరు కోరు కుంటున్నారిక్కడ!'' ఆమె చెమట తుడుచు కుంటూ అంది. ''మేమంతా ఫుట్‌బాల్ అసోసి యేషన్ పెట్టుకుని ప్రతి సాయంత్రమూ ఆడు కోవాలని నిర్ణయించుకున్నాం... ఆటాడు తుంటే మా ఒత్తిడిమటుమాయమవుతోంది..'' అశోక్ అంకుల్ చావుకబురు చల్లగా చెప్పాడు.

''మరి మా విషయం ఏమిటి?'' అవినీష్ ఎగిరాడు.

''పోయి టీవీ చూసుకోండి. ఇక బయల్దే రండి,'' గోపాల్ అమ్మ బంతిని అద్భుతంగా ఎగిరి పట్టుకుంటూ చెప్పింది.

పిల్లలు బయటకు వెళుతుండగా గోపాల్ తనకేసి ఆరు జతల కళ్లు తీక్షణంగా చూడటం గమనించాడు. నువ్వూ, నీ వెధవప్లానూ!'' వాళ్లు ఒక్కసారిగా ఎగిరారు.

– రమా రమేష్



# HELP JIM

ఒక రోజు క్లాసిలో "జిమ్"ను ప్రశ్నిస్తూ మంచి, చక్కటి పాత కొబ్బరికాయలోని పోషక గుణాలను వివరంగా బ్లాక్ బోర్డుపై రాయమన్నారు. ఐతే, తను వాటిలోని కొన్ని గుణాలను మరిచిపోయినట్లున్నాడు. అతనికి సహాయచేయండి, చేస్తారా?

P_O_ _I_S
_IN_R_L_
V_ _A_ _NS
CAR_ _ _Y_ _ATE_
F_B_ _

కొబ్బరికాయ పీచు పదార్థాలు, కార్బోహైడ్రేట్లు, విటమిన్లు, ఖనిజాలు మరియు ప్రోటీన్లు ఇవన్నీ అధికంగా కలిగియుండి అన్నివేళల్లో ఒక గొప్ప "ఉపయోగకరమైన ఆహార పదార్థ" మైనది.



**Coconut Development Board**
(Ministry of Agriculture, Government of India)
cdbkochi@dataone.in, www.coconutboard.gov.in

magnumintergrafiks/chn

CHANDAMAMA (Telugu) April 2010 Registrar of Newspapers of India No.1114/57. Regd No. TN/CH(C)/216/09-11
Licensed to post WPP - Inland No.TN/CC(S)Dn/84/09-11, Foreign No. 85/09-11

# బుబ్బా జట్టు సాహసాలు




























